
ఈ సంవత్సరం నేను వినబోయేవి అన్నీ తీపయిన వార్తలుగా ఉండాలన్న ఉద్దేశంలో ఈసారి ఉగాది పచ్చడి లో బెల్లం తప్ప మరేమీ వేయించ లేదు !!
మీ


ఈ కథలో అన్ని రుచులూ మిళితమై ఉన్నాయి సార్!! ఉగాది పచ్చడి సేవించి మరీ రాశాను దీన్ని !!!


ఈయన గడ్డం ఇంత తీయగా ఉందేం బావా?
ఈరోజు ఉగాది పండుగ మరదలా!!


ఆఖరికి నీళ్లు తాగినా యీ సీసా తోనే తాగుతా నని నీకు బాగా తెలుసు గా! అదేదో ఇందు లోనే పొయ్యి!!
VAT 69



జెమిని సమర్పించు

# కలెక్టర్ జానకి

ఈస్ట్‌మన్ కలర్

సాంఘిక చిత్రయుగంలో
ఒక సంచలనం







మాటలు: రాజశ్రీ
పాటలు: డా॥ సి. నారాయణరెడ్డి
సంగీతం: వి.కుమార్
కెమెరా: కపాడియా
నిర్మాత-దర్శకుడు: యస్.యస్.బాలన్

# ఉత్తరాలు

పాఠకులకి, రచయిత(త్రు)లకి మా ఉగాది శుభాకాంక్షలు. సం॥

**ముఖచిత్రం**

వారపత్రిక మంజాల ముఖచిత్రం నన్నెంతో ఆకర్షించింది. కథల్లో ఒక 'జేబుదొంగ' 'మాయ' బాగున్నాయి.

—వాసిలాల రమాకాంతం, (కోనాపూర్—సెంబట్ల)

•

ప్రఖ్యాత ఇంగ్లీషువారపత్రిక 'బ్లిట్స్' 26.2.72 సంచికలో సుప్రసిద్ధ రాజకీయ వ్యాఖ్యాత శ్రీ జి.ఎస్. ఆచార్య ఇలా రాశారు. (అనువాదం)—

'ముఖ్యమంత్రి సరసు ఎంతో కీలకం అయినది. ఇది నాయకత్వాన్ని బట్టి కాదు ఒక ప్రాంతంలో యాదృచ్ఛికంగా జన్మించటం వల్ల 'తిరగాలి' అనే సిద్ధాంతం పాతబడింది, ప్రమాదకరమయినదీ కూడా.

'జాతి, రాజ్యం ఒకటే అనే చైతన్యానికి కావలసిన కనీసపు అవసరం ఇది, సోషలిజమ్‌కి అవసరమయిన మొదటి నియమం. ఈ దృష్టితోనే నేను ఇటీవల శ్రీమతిగాంధీగారు అన్నట్లు వార్తలలో వడిన కొన్ని మాటలతో ఏకీభవించలేకుండా ఉన్నాను. (ఫిబ్రవరి 17 నాడు వరంగల్‌లో మాట్లాడుతూ) ఆమె హైదరాబాద్ హైకోర్టు వారు 'ముల్కీనిబంధన' అని రద్దు చేస్తూ ఇచ్చిన తీర్పు వల్ల ఏర్పడే పరిణామాలని ఏ విధంగా తప్పించవచ్చునో చెప్పారుట.

'ఈ విషయంలో ప్రజలు స్పష్టంగా ఆలోచించటం లేదు. ప్రతి పౌరుడూ ఉద్యోగం కోరటంలో అన్యాయం ఏమీలేదు, అది ఏ చట్టానికీ విరుద్ధం కాదు. అంటే, ప్రతివ్యక్తికీ ప్రభుత్వోద్యోగమే దొరకాలని కాదు దీని అర్థం. దాని అర్థం ఏమిటంటే, అన్ని రంగాలలోనూ ఉద్యోగావకాశాలు పెంచాలని.

'కాని, ప్రభుత్వోద్యోగాలలో ఒకవ్యక్తి ప్రాంతాన్ని బట్టి ప్రతికూలమయిన విచక్షణ చూపించటం పూర్తిగా చెడ్డదని. మనం రాష్ట్రాభిమానాలని విపరీతంగా పెంచుకోవడం వల్ల ఒక రాష్ట్రంలో వారికి మరొక రాష్ట్రంలో తగిన ఉద్యోగావకాశాలు, వారి సంతానానికి తగిన విద్యాభ్యాసావకాశాలు లభించని పరిస్థితి ఏర్పడింది. ఈ సిద్ధాంతాన్ని ఒకే రాష్ట్రంలో వేరువేరు ప్రాంతాలకి వర్తించటం ఘోరం.

'పునరుక్తి అనిపించవచ్చుగాని, నేను నొక్కి చెప్పేది ఏమిటంటే— ఒక పురుషుడు గాని ఒక స్త్రీగాని ఏ ప్రాంతంలో పుట్టినా, ఏ కులంలో మతంలో పుట్టినా ఎంత తక్కువ లేక ఎక్కువ ఉద్యోగానికి అవి ఏమాత్రం ప్రసక్తం కాకూడదు.'


మంచికి మారుపేరు
ధైర్యానికి ప్రతిరూపం
ఆడది అబలకాదు. అగ్నిపర్వతం
అని నిరూపించే వీరవనిత సాహసగాథ
పి.ఎన్.ఆర్. పిక్చర్స్
ఈస్ట్‌మన్‌కలర్
దర్శకత్వం: కె.ఎస్.ఆర్.దాస్
నిర్మాత: పింజల నాగేశ్వరరావు
ఆంధ్ర: శ్రీ కల్యాణి పిక్చర్స్ * నైజాం: PSR పిక్చర్స్ * సీడెడ్: శ్రీ గౌరి పిక్చర్స్
చిత్తూరు: శ్రీ వెంకటరమణా పిక్చర్స్ * మైసూరు: అజంతా మూవీస్
VIJAYA

# ఉత్తరాలు

ఇటీవల 'రైసింగ్‌సన్' అనే ఒక ఆంగ్ల వారపత్రిక (ఇది మదరాసు నుంచి వెలువడుతుంది, దీని సంపాదకుడు ద్రా. ము. క., పార్లమెంటు సభ్యుడు తిరు మురసొలి మారన్) ప్రధానమంత్రి శ్రీమతి గాంధి 'అగ్ర' కులాల వారికే ప్రాధాన్యత ఇస్తున్నారని సూచించే, ఆరోపించే, ఒక వ్యాసాన్ని, ఒక ఇంటర్వ్యూని ప్రచురించింది. వ్యాసం రాసిన వారు ద్రా. ము. క., పార్లమెంటు సభ్యులు శ్రీ కె. మనోహరన్. ఇంటర్వ్యూ సోషలిస్టు నాయకుడు శ్రీ జార్జి ఫెర్నాండెస్‌తో జరిగింది!

ఇప్పుడు రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధానమంత్రి, ఆంతరంగిక వ్యవహారాలమంత్రి, సమాచార శాఖమంత్రి, ఆరోగ్యశాఖమంత్రి, న్యాయశాఖ మంత్రి, ఉత్తరప్రదేశ్‌ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఒకే కులంవారనే ప్రచారం జరుగుతోంది!

మహారాష్ట్ర ముఖ్యమంత్రి పదవి కూడా 'పరంజిపె' అనే ఒక మాజీ హైకోర్టు జడ్జికి ఇవ్వటానికి ప్రధానమంత్రి ప్రయత్నిస్తున్నారనీ దీనికి కారణం కులాభిమానమేననీ బొంబాయి వారపత్రిక 'కరెంట్' అంటుంది.

కొంతకాలం క్రితం చైనా నాయకుడు శ్రీ చౌ ఎన్ లాయ్ బ్రిటిష్ సామ్రాజ్యం తర్వాత ఢిల్లీలో మరొక కులం సామ్రాజ్యం మొదలయిందన్నారనే వార్త వెలువడింది. 'అగ్ర' కులాల వారు, షెడ్యూల్ కులాలు తరగతులవారు, కొందరు అల్పసంఖ్యాకుల వర్గాలవారు (బంగ్లాదేశ్ విడిపోయే దాకా ఒకమతం వారు ఈ రకం వారికిందనే పరిగణింపబడ్డారు) ప్రధానమంత్రి నాయకత్వం కింద కూడగట్టుకుని తక్కిన కులాలవారి కూటమికి ప్రతికూలమయిన ఒక పెద్ద సాంఘిక పరివర్తనం తీసుకువస్తున్నారనే వ్యాఖ్యకి కూడా కొంత ప్రచారం లభిస్తోంది!

1967 ఎన్నికల ముందు కమ్యూనిస్టుపార్టీ తాలూకు పత్రిక ఒక దానిలో ద్రా.ము.క., వారి ఉద్యమం బూర్జువా వర్గాల వారి ఉద్యమం అనే వ్యాఖ్యానం ఒకటి ప్రచురించటం జరిగింది. 'స్వరాజ్య' పత్రిక సంపాదకులుగా మరణించిన శ్రీ ఫిలిప్‌స్ప్రాట్ డా. 'సరస్వతి' అనే వారి అనుశీలనలని ఉదహరిస్తూ తమిళనాడులో (కనీసం ఆయన పుస్తకం రాసేనాటికి) 'మధ్య' కులాలవారే ఎక్కువ ద్రా.ము.క. అభిమానులుగా ఉంటారనీ, 'నిమ్న' కులాలవారు అధికంగా కాంగ్రెస్‌నే బలపరుస్తారనీ అన్నారు!

దీనంతటిని చూస్తే ఒకటి మాత్రం స్పష్టం అవుతోంది—అవసరాన్ని అభిమానాలని, ద్వేషాలనీ బట్టి ఎవరికి ఇష్టం వచ్చినట్లు వారు వ్యాఖ్యానిస్తున్నారు.. ప్రాంతీయాభిమానాలని శ్రీమతి ఇందిరాగాంధీ గారి కొత్తకాంగ్రెసు కూడా జయించలేకపోయింది కాబట్టి ప్రాంతీయ వాదమే ఏదో ఒక మిషమీద జయించగలదు అని. . . . . .

కె. రామలింగం, (మదరాసు).●


# ఆంధ్రపత్రిక వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 17-3-72

శ్రీ విరోధికృన్నామసం॥ ఫాల్గుణమాసం॥ బ॥ దశమి

సంపుటము : 65 సంచిక : 30

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31.20 |
| 6 మాసముల చందా | 15.60 |
| 3 మాసముల చందా | 7 80 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన శ్రీ గని శెట్టి
లోపలి అట్టపేజీలలో ఉగాది కార్టూన్లు


తకుువ కులాల పార్టీ అభ్యర్థులని
వోడించడానికి మనం కృషి చేయాలి
మనం క్రమశిక్షణకల పార్టీ
సభ్యులం కాబట్టి దాన్ని
బహిరంగంగా చెయ్య
లేము కదా!


రేపటి విందు
తైవాన్


చైనా
ఒకరు ఇంకొకరిని
స్వారీకి తీసికెళ్తున్నారు!


మరోవిడత
రక్తపాతానికి
సిద్ధంగా ఉండు
తిక్కాఖాన్!


పాకిస్తాన్
అంతటా
అశాంతి

17—8—72

# సంవత్సరాది పండుగ

సంవత్సరానికి ప్రారంభమైనదినం సంవత్సరాది. ఆరోజున పండుగచేసుకోవడం తరతరాలనుంచీ వస్తూవున్న ఆచారం! ఈ పండుగ అందరికీ ఎంతో ఆనందాన్ని కలిగిస్తూ ఉంటుంది.

ఈ పర్వదినాన్ని అనేకులు అనేక రీతులుగా పరిగణిస్తున్నారు. సంవత్సరంలో ఉండే రెండు ఆయనాల్లోనూ ఉత్తరాయణ ప్రారంభదినం... అంటే మకర సంక్రాంతి సౌరమాసంలో సంవత్సరాది. తమిళనాడులో సౌరమానమే అనుసరించబడుతుంది. వాస్తవంగా మకరసంక్రాంతియే తమిళులకు సంవత్సరాది కావలసింది. అయితే—వారు మేష సంక్రాంతినే సంవత్సరాదిగా గ్రహిస్తున్నారు. తెలుగు సంవత్సరాదికి తర్వాత అరవ సంవత్సరాది— మరికొన్ని రోజులకు వస్తుంది. తెలుగువారికీ, కన్నడిగులకూ, మహారాష్ట్రులకూ చైత్ర శుద్ధ పాడ్యమి సంవత్సరాది చాంద్రమానాన్ని అనుసరించే వారందరున్నూ ఈ దినమే పండగ చేసుకుంటున్నారు. గుజరాతీలు కార్తిక శుద్ధ పాడ్యమినాడు సంవత్సరాదిని చేసుకుంటున్నారు.

ఈ పండుగ యిన్నివిధాలుగా ఉండడానికి కారణం ఏమిటనే ప్రశ్న కలగడం సహజమే!

చాలా శ్రమపడి, అనుకూలఫలితాలు లభించగా ఆనందం కలుగుతుంది. అష్టకష్టాలనుండి గట్టెక్కినప్పుడు, అనారోగ్యంనుండి పూర్తిగా కోలుకొన్నప్పుడూ సంతోషం కలగడం సహజం! ఆ ఆనందంతో— ఇష్టమైన పదార్థాలను బంధుమిత్రులతో ఆరగించడమే పండుగ! ఈ పండుగ పలువిధాలుగా ఉండడానికి అదే కారణం అనుకోవడం కొంత సబబుగనే తోస్తుంది.



పూజార్థము (చిత్రం: వై. బాలయ్య)

## స్నేహ మధు మాసం

కొమ్మొమ్మని కెమ్మొమ్మని ముద్దుగొను కోకిలమ్మ
గళ మంగళారవమ్ము మేల్కొల్పి జగమునే
నవ వర్ష భామినికి స్వాగతము అందించె

చైత్ర రథమెక్కి మన్మథస్వామి విచ్చేసెను
రాత్రుల మధురవౌ రతిసాధు శుభదృశ్యమ్ము
మనికిలో ఆమనికి ప్రాణాలు పోసెను

నశియించె విధుర జీవన బాధా విషాదోక్తి
రవళించె భవిష్యదుషో స్వాప్నిక వంశనాదకి
విచ్చెసె లోకాల స్నేహ మధుమాసమ్ము
విరబూసె హృదయాల మల్లికాహాసమ్ము

—వి. శీలావతి

వ్యవసాయం ప్రధానంగాగల మనదేశంలో కర్షకులు నానా శ్రమలుపడి, రాత్రనక, పగలనక, వర్షాలలో తడుస్తూకూడా పొలం పనులు చేసుకుంటూ పంటలు పండించుకొంటారు. తమ కృషి ఫలితమయిన ఫలసాయం ఇంటికి చేరుకునేటప్పటికి మకర సంక్రమణం వస్తుంది. అంతవరకూ వారికి ఇంటిపైని దృష్టి తక్కువ; ఆలోచనలన్నీ పొలంపైనే ఉంటాయి. ధాన్యలు ఇళ్ళు చేరేసరికి, వారు నిర్విచారం. ఇళ్ళవసలు మోసుకుంటారు ఇళ్ళను బాగుచేసుకొని, గోడలకు సున్నం కొట్టించి, రంగవల్లులతో గృహాలను అలంకరించి ఎంతో సంతోషంతో పండుగ చేసుకుంటారు అందువల్లనే మకరసంక్రాంతి పెద్దపండుగ అయింది!

శిశిరంలో చాలాప్రాంతాలలో హిమపాతం వల్ల ప్రకృతి నిద్రాణావస్థలో ఉంటుంది. చెట్లు ఆకులన్నీ రాలిపోయి వట్టి మొరళ్ళే కానవస్తాయి. వసంతోదయం నిద్రాణమై ఉన్న ప్రకృతిని మేలుకొల్పి పునరుజ్జీవింప జేస్తుంది చైత్రం రాగానే చెట్లు చిగిర్చి నూతనశోభను కూరుస్తూ అందరి హృదయాలనూ ఆకర్షిస్తాయి. కోకిల మధుర కంఠ ధ్వని వీనుల విందుగా వినవస్తుంది. ఈ కారణాలవల్ల చైత్రమాస ప్రారంభంతో నూతనాబ్దం ప్రారంభమవుతుంది.

కార్తీకమాస ప్రారంభంతో కొత్త సంవత్సరం పుట్టడం వ్యాపారపద్ధతి ననుసరించినది. దక్షిణాదివారు ఉద్యోగాలకు ప్రాకులాడే సేవావృత్తిని అవలంబిస్తారు. కాని, గుజరాతీలు, మార్వాడీలు మొదలైన ఉత్తరాదివారు వ్యాపారంచేసి, స్వతంత్ర జీవనం సాగిస్తారు వ్యాపారులకుండే సంపాదన ఇతరులెవ్వరికీ ఉండదనే సంగతి

ప్రపంచంలో ఏ మారుమూల వున్నవారికైనా తెలుసును. వారి ఆదాయవ్యయాల లెక్కలు దీపావళి అమావాస్యతో ముగింపుకు వస్తాయి. మర్నాటినుంచీ కొత్త చిఠాలలో కొత్త లెక్కలు ప్రారంభమవుతాయి. వత్సరాంతపు లెక్కలు చూసుకుంటే కొలెదు లాభం కానవస్తుంది. దానివల్ల వింతో ఆనందం కలుగుతుంది. కొందరికి ఎక్కువ లాభం కానరాకపోయినా — లాభాలలో కొంత నష్టం కానవస్తుందేమో కాని, నష్టం ఎంతమాత్రం ఉండదు. ఆ ఆనందంకొద్దీ వారు లక్ష్మీదేవిని— ధననిచయాన్ని పూజించి పండుగ జరుపుకుంటారు. క్రమంగా ఈ ఆచారం వ్యాపారస్తులయిన ఇతరులకూ— ముఖ్యంగా ఆంధ్రవ్యాపారులకూ సంక్రమించింది. ఈ విధంగా కార్తీక శుద్ధపాడ్యమికూడా సంవత్సరాది అనే పేరు పొందింది.

ఈవిధంగా ఉగాదులు విభిన్నపద్ధతులలో ఉన్నప్పటికీ సౌరమానాన్ని అనుసరించేవారికన్న చాంద్రమానాన్ని అనుసరించేవారే అధికసంఖ్యాకులు అని తెలుస్తున్నది. తమిళులు ఒక్క సంక్రమణ విషయంలో తప్ప మిగిలినవాటిలో చాంద్రమానాన్నే అనుసరిస్తున్నారు. శ్రీరామనవమి, జన్మాష్టమి, వినాయకచవితి, విజయదశమి, దీపావళి, వైకుంఠఏకాదశి — మొదలైనవి చాంద్రమానాన్ని అనుసరించినవేకదా!

ఎక్కువమంది చాంద్రమానాన్నే ఎందుకు అనుసరిస్తారు? అని ఆలోచిస్తే— దానికిన్నీ తగిన సమాధానం దొరుకుతుంది. సౌరమానాన్ని తెలుసుకోవడం కష్టం. చాంద్రమానం అందరికీ సులభంగా తెలుస్తుంది. సౌరమానంలో సంక్రమణం ఎప్పుడయేదీ పంచాంగాలనుబట్టే తెలుసుకోవాలిగాని చూచి తెలుసుకోలేము. మకరసంక్రాంతినాడు ఉత్తరాయణ ప్రవేశమయినా — రథసప్తమి దాటితేనేగాని, సూర్యునిగమనంలో మార్పు కానరాదు. చాంద్రమానంలో ఆ రీతినికాకుండా—శుక్ల పాడ్యమి మొదలు అమావాస్యవరకూ తిథులు — చంద్రుని తేడాలు, దర్శాదర్శనాలు స్పష్టంగా కనబడుతూనే ఉన్నాయి.

పయికారణాలవల్ల చాంద్రమానంలో సంవత్సరాది చైత్ర శుక్ల పాడ్యమి కావడం ఉచితమైనట్టు కానవస్తున్నది. బ్రహ్మదేవుడు సృష్టిని ప్రారంభించినది ఆనాడే అంటూ హేమాద్రిపండితుడు ఇలా చెప్పియున్నాడు.

'చైత్రేమాసి జగద్బ్రహ్మ
  ససర్జ ప్రథమేఽహని,
శుక్లపక్షే సమగ్రం తు
  తదా సూర్యోదయే సతి,
ప్రవర్తయామాస తథా
  కాలస్య గణనామపి.'

సృష్టికర్త అయిన బ్రహ్మ చైత్ర శుద్ధ పాడ్యమినాడు సూర్యోదయ సమయంలో సమస్తమైన జగత్తును సృజించాడు. ఆ విధంగా సృజించి, అనంతమైన కాలానికి, అప్పటినుంచీ ఒక లెక్కను కూడా ఏర్పాటు చేశాడు— అని దీని అభిప్రాయం.

గ్రహ నక్షత్రాదులను ఆయా పద్ధతులలో ఉండేటట్లు చేసి, పక్షాలనూ, నెలలనూ, ఋతువులనూ, అయనాలనూ, సంవత్సరాలనూ ఏర్పాటుచేసి, కాలమానం క్రమ పద్ధతిలో ఉండేటట్లు బ్రహ్మయే ఏర్పరచెనని కూడా ఆయన చెప్పారు.

నిర్ణయ సింధుకారుడగు కమలాకరభట్టు కూడా 'చైత్ర శుద్ధ ప్రతిపత్తు'నాడే నూతన సంవత్సరం ప్రారంభమవుతుందని చెప్పాడు. ధర్మసింధు కారుడున్నూ ఇట్లే చెప్పియున్నాడు.

'శక చాంద్ర సంవత్సరస్య చైత్ర శుద్ధ ప్రతిపద్యారంభః.' 'చంద్రాబ్దో మధు శుక్లగ ప్రతిపదారంభ' ఇతి దీపికోక్తేః.' అని పై విషయాన్నే స్మృతి కౌస్తుభ కారుడున్నూ నిర్ణయించియున్నాడు.

కాలమునకు పరమావధియైన యుగం యొక్క నిర్ణయం కూడా సృష్ట్యాదినుండే ప్రారంభమయి నందునను, అది చాంద్ర సంవత్సరాదితో ప్రారంభమైనందునను సంవత్సరాదికి 'యుగాది' అనే పేరు వచ్చి, అదే 'ఉగాది'గా మార్పు చెందినది. వాడుకలో 'ఉగాది' అనే పేరే ప్రసిద్ధమయి ఉన్నది.

ధర్మశాస్త్రాలలో మానములు— చాంద్రమానం, సౌరమానం, సావనమానం, బార్హస్పత్యమానం, నాక్షత్రమానం చెప్పబడి వున్నవి. ఆంధ్రులు చాంద్రమానాన్ని అనుసరిస్తున్నారు. తమిళులు, మలయాళీలు, బంగా

# సంవత్సరాది పండుగ

లీలు, పంజాబీలు, ఆసామీలు మున్నగువారు సౌరమానాన్ని అనుసరిస్తారు. ఎవరు ఏ మానాన్ని అనుసరించినా కర్మకలాపానికి చాంద్రమానమే గ్రహించదగినదని సిద్ధాంతం. ఈ విషయాన్నే—

'స్మరేత్సర్వత్ర కర్మాదౌ
చాంద్రం సంవత్సరం సదా,
నాన్యం యస్మాద్వత్సరాదౌ
ప్రవృత్తి స్తస్య కీర్తితా.'

అనే శ్లోకం తెలియపరుస్తున్నది.

'అన్ని ప్రాంతాలలోనూ, కర్మలను ఆచరించేటప్పుడు చాంద్రమాన సంవత్సరాన్నే గ్రహించాలి. మరొకదాన్ని గ్రహించ కూడదు. ఎందుచేతనంటే — వత్సరాదిలో దానికే ప్రవృత్తి ఉంటున్నది' అని దీని భావం.

ధర్మశాస్త్రకారుల నిర్ణయం ఇది. అందువల్లనే సౌరమానం అనుసరించబడుతున్న ప్రాంతాలలో కూడా వైదిక కర్మలకు చాంద్రమానమే గ్రహింపబడుతున్నది.

ఉగాది పండుగనాడు అందరూ ఉషఃకాలానికే అభ్యంగస్నానం చేసి, క్రొత్త వస్త్రాలు ధరిస్తారు. పంచాంగాన్నీ, సంవత్సరాది దేవతను పూజిస్తారు. షడ్రసోపేతమైన రసాయనాన్ని — అనగా ఉగాది పచ్చడిని నివేదన చేసి, దాన్ని అందరూ సేవిస్తారు. తర్వాత కలిగినంతవరకూ మృష్టాన్నాన్ని బంధుమిత్రులతో కలిసి భుజించి సంతృప్తి చెందుతారు.

భోజనానంతరం కొంత విశ్రాంతి తీసుకుని ప్రొద్దు మూడజాములు తిరిగిన తర్వాత తమ గృహంలోనో, దేవాలయంలోనో, నలుగురూ గుమికూడిన స్థలంలోనో పంచాంగశ్రవణం చేస్తారు. పురోహితుని మూలంగా — ఆ సంవత్సరం తమ ఆదాయవ్యయాలను, రాజపూజ్యావమానాలను, కందాయఫలాలను, ఆ సంవత్సరపు రాజు, మంత్రి, సేనాధిపతి, సస్యాధిపతి, పశుపాలకుడు మున్నగువారి విషయాలను, సంక్రాంతి పురుషలక్షణాన్నీ— ఆ సంవత్సరంలో తమ భావిజీవితాన్ని సంగ్రహంగానూ తెలుసుకుని తమకు రాబోయే చిక్కులను తొలగించుకుని సుఖంగా జీవించడానికి ఆనాడే సంకల్పించుకుంటారు.

వసంతనవరాత్రులు సంవత్సరాదితోనే ప్రారంభమవుతాయి. వసంతోత్సవం అంతకుముందు—ఫాల్గుణ పౌర్ణమినాడు జరిగినా— వాస్తవానికి వసంతోదయం చైత్రంతోనే ప్రారంభమవుతుంది. నాటినుండి శ్రీరామనవమివరకూ తొమ్మిదిదినాలు ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి. నాడు మొదలు చాలచోట్ల శ్రీమద్రామాయణ పారాయణం ప్రారంభమయి నవమినాటికి పూర్తి అవుతుంది శ్రీమద్రామాయణం సకల శ్రేయస్సంపాదకమని మన పెద్దల విశ్వాసం.

కడచిన సంవత్సరం విరోధికృత్తు. ఉగాదితో పరీధావి ప్రారంభమవుతున్నది. విరోధికృత్తు మనదేశానికి విరోధులను కల్పించినది. ఒకవిధంగా విరోధివర్గాన్ని

**పిల్లలు—ఆరోగ్యము**

## అంటువ్యాధులు - జాగ్రత్తలు

సాధారణంగా కొన్ని రకాల అంటువ్యాధులు పిల్లలకి వచ్చే అవకాశం ఎక్కువగా ఉన్నది. వాటినుంచి పిల్లలని కాపాడి భావి పౌరులు ఆరోగ్యంగా, దృఢంగా, పెరగటానికి తల్లిదండ్రులు, వైద్యులు తగిన ముందు జాగ్రత్తలు తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది.

పిల్లలని వారు పుట్టినది మొదలుకొని అయిదు సంవత్సరాల వయసు వచ్చేవరకూ అంటు వ్యాధుల బారినుంచి వారిని కాపాడటానికి ఆయా సమయాలలో ఆయా వ్యాధుల నిరోధక అవుషధాలని వైద్యుని సలహానుసరించి ఇవ్వాల్సి ఉంటుంది.

బిడ్డ పుట్టిన రోజు లేక ఆ మరునాడు అయినా క్షయరోగ నిరోధక వాక్సిన్ బి. సి. జి. వేయించాల్సి ఉంటుంది. మూడవ నెలలో మసూచికం రాకుండా ఉండేందుకు టీకాలు వేయించడం మరువ కూడదు. నాలుగవ నెలలో ట్రిపుల్ యాంటిజెన్ మొదటి మోతాదు ఇచ్చి మిగతా రెండు మోతాదులు నెలకొకటి చొప్పున అయిదు, ఆరవ నెలల్లో ఇవ్వాలి. అలాయిచ్చినందువల్ల పిల్లలకి కోరింత దగ్గు, డిఫ్తీరియా, రోగాలు రాకుండా కాపాడవచ్చు. ఏడవనెలలో పోలియో జబ్బు రాకుండా జాగ్రత్త పడటానికి పోలియో డ్రాప్స్ మొదటి మోతాదు వేయించాలి. తర్వాత ఆరువారాలకి రెండవ మోతాదు, మరల అదే వ్యవధిలో మూడవ మోతాదు వేయించడం మరచిపోకుండా ఉండాలి.

తరువాత బిడ్డకి 18 నెలలో ఒకసారి, నాలుగున్నర సంవత్సరాలు వచ్చిన తర్వాత మరొకసారి ట్రిపుల్ యాంటిజెన్ మళ్ళీ ఇవ్వాల్సి ఉంటుంది.

అయిదో సంవత్సరం రాగానే టైఫాయిడ్ జ్వరం రాకుండా ఉండేందుకు టి.ఎ.బి మొదటి మోతాదు ఇచ్చి తర్వాత 15 రోజులకి రెండవ మోతాదు ఇవ్వాలి.

ఇవికాకుండా చుట్టు పక్కల కలరావ్యాధి, ఉందని తెలియగానే కలరా వాక్సిన్ వేయించాలి. ఇలాంటి జాగ్రత్తలు పెద్దలు తీసుకుంటే పిల్లలకి అంటువ్యాధులు రావు. వారు ఆరోగ్యంగా ఆనందంగా పెరగటానికి అవకాశం ఉంటుంది.

ఈ వ్యాధి నిరోధక అవుషధాలు సాధారణంగా మందుల షాపులలో, పెద్దాస్పత్రులలో, మిషనరీ ఆస్పత్రులలో, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో, జిల్లా పరిషత్ వైద్యశాలలో, మునిసిపల్ డిస్పెన్సరీలలో లభ్యమవుతాయి.

— డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

ఛేదించి భారతదేశ గౌరవాన్ని నిలిపింది కూడా. ఈ పరిధావి దేశంయొక్క పురోభి వృద్ధికి దోహదమిస్తూ — ఆ మార్గంలో అన్నిరంగాలలోనూ పరుగెత్తగలదని, దానికి దేశంలోని వివిధపక్షాలవారూ సమైక్యతతో సహకరించాలని కోరడం, సహకరించగలరని ఆశించడం ప్రతి భారతీయునికి ఆవశ్య ధర్మం.

—బి. వేం. ర.

---

# అద్భుతమైన రుచి

## ఒక లక్షణమైతే



# బలవర్థకమైన పోషకత్వం మరొక శ్రేష్టమైన లక్షణం




అహా! కరకరలాడిస్తూ తినటం పోషణ పొందటం ఎంత బాగుంటుంది! పార్లే గ్లూకో బిస్కట్లలో పాలు, గోధుమ పంచదారలోని సారం, అత్యధికంగా ప్రోటీన్లు, విటమిన్లూ కూడా ఉన్నాయి.

**పార్లే గ్లూకో బిస్కట్లు**

**ప్రత్యేకించి పిల్లలకు ఎంతో మంచివి**

భారతదేశంలో అత్యధికమైన అమ్మకం కలిగిన బిస్కట్లు

everest/4/PP/Tel




సినిమా తీయడానికి రకరకాల ఫిలిమ్స్ వాడతారు లెండి. అసలు బొమ్మతీసే ఫిలిమ్‌ని నెగిటివ్ అంటారు.

కెమెరా మ్యాగజిన్ లోకి ఫిలిమ్‌లోడ్‌చేసి దీపాలని వెలిగించి షాట్ రెడీ చేస్తాడు కెమెరామెన్—షూటింగ్ మొదలయింది—'స్టార్ట్'—! దర్శకుని ఆజ్ఞ! కెమెరా తిరగడం మొదలు—

'యాక్షన్ !' దర్శకుని మరోకేక ! ! శోభనం గదిలోకి నవవధువుని పంపిస్తూ స్నేహితురాండ్రు గేలిచేసే సీను—

స్నేహితురాలు: 'సఖీ! తొలిరేయి ప్రతీ స్త్రీకి అవసరం!'

'మా తల్లో చంపావ్!' దర్శకుని రంకె.

'సార్! కెమెరా ఆపమంటారా!' కెమెరా మెన్ ప్రశ్న!

'అలా కాదమ్మా — తొలిరేయి ప్రతి స్త్రీకి అపురూపం!!

'సార్ ! కెమెరా ఆపమంటారా !' కెమెరామెన్ ఆలాపన!

'నువ్వుండవయ్యా ! ఆవిడ తప్పుడు డైలాగ్ చెప్పింది!'

'అవసరం కాదమ్మా — అపురూపం!!'

కెమెరా తిరుగుతూనే వుంది.

అప్పటికి గుర్తుకు వచ్చింది దర్శకునికి—

'కట్—' అన్నాడు.

కెమెరా ఆగింది!

గోవిందా వెయ్యి అడుగుల ఫిలిమ్—

'బాబోయ్ వెయ్యి డుగులు — మూడు వందల యాభై రూపాయలు—ఒక క్వింటాల్ మిరపకాయలు!' నిర్మాత విలాపం!!

'కొత్తగదండీ రాణికి — అబ్బా! ఏమి వాయిస్! ఏమి యాక్షన్!!'

[పొగడాలికదా ! కావాలని రాణిని బుక్ చేయించాడాయే నిర్మాత నెత్తిన కూర్చుని]

మరలా మొదలు—'స్టార్ట్!యాక్షన్!!'

'ప్రతి స్త్రీకి తొలిరేయి అపురూపం—అవసరం కాదు—'

'తల్లోయ్ చంపావ్ ! అవసరం వద్దమ్మా—' దర్శకుని ఆక్రోశం!

మరలా ఐదువందల అడుగుల ఫిలిమ్—

నిర్మాత ఉక్రోషంతో — కోపవచ్చి కుర్చీలో కూలబడ్డాడు.

'పాపం రాణికి తొలిరేయి అవసరమేమో!'

సహకార దర్శకుని చమత్కారం—

గొల్లున నవ్వులు—రాణి బెదిరి మూలకు చేరింది—

'షటప్—నీ పని నువ్వు చెయ్—' దర్శకుని ఛీత్కారం—

పాపం — సహకార దర్శకుని మొఖం మాడిపోయింది—

'అరేయ్ — రాణీకి వేడివేడి కాఫీ యివ్వండి!' దర్శకుని ఆజ్ఞ!

ఎలాగో రాణి దరిచేరి 'ఏదమ్మా! డైలగ్ చెప్పు!' అంటాడు దర్శక మహాశయుడు—

నిర్మాత కోపంతో బుసకొట్టి 'తల గోక్కుంటూ, పెదవి కొరుక్కుంటూ బయటికి వెళ్ళిపోతాడు ! మరలా ఫిలిం తెప్పించాలి ! బజారులో కూరగాయలా ! వెంటనే కొనెయ్యడానికి — దానికి పర్మిట్ కావాలి— శాంక్షన్ కావాలి!!

రాణికి కాఫీ యిచ్చివస్తున్న బోయ్‌తో కెమెరామెన్ 'ఏరా! అమ్మగారికి పొద్దున టిఫిన్ పెట్టలేదా — ఆకలివేసి ఫిలిం మేస్తోంది'— అంతా నవ్వులు!!

రాణీ దర్శకునితో—

'నిన్నెమో బోల్డు కబుర్లు చెప్పారు— ఈ సినిమాలో హీరోయిన్ని చేస్తానని!!'

'ఎక్కడ రాణీ! నిర్మాతగాడు ఒప్పుకుంటేగా!'

'నిర్మాత— నా జేబులో బొమ్మ అన్నారుగా!'

రాణీ విస్ఫారత—

'కాదేమిటి — ఆయనగారు కుసుమను బుక్ వేశారు హీరోయిన్‌గా—'

రాణీ బరువైన నిట్టూర్పు!!

'ఏమిటి రాణీ ! — నా చేతులో ఇదికాక మూడు సినిమాలున్నాయ్ — వాటిల్లో నువ్వే హీరోయిన్!! బిగ్గరగా— 'ఏదమ్మా! డైలాగ్ చెప్పు!!'

ప్రతిరేయి స్త్రీకి అపురూపమైనది !'

'సార్! మాగజీన్ ఫేంల్' కెమెరామెన్ అంటాడు.

(అంటే లోడ్‌చేసిన ఫిలిం అయిపోయింది. మళ్ళా లోడ్ చెయ్యాలి— అంతాక అందరికీ రెస్ట్!!)

మాగజీన్ ఛుజాన వేసుకుని బయలుదేరుతాడు డార్క్‌రూమ్‌కి కెమెరా అసిస్టెంట్!

దారిలో అప్పలమ్మ కన్పించింది—

అంతే! కబుర్లు మొదలు—

అప్పలమ్మ లైన్ క్లియర్ అంటుంది— మరుక్షణం — అసిస్టెంట్ అజాపజా వుండడు— ఇక్కడ — రాణీ పక్కకు మెల్లగా జేరతాడు దర్శకుడు—

'చూడు రాణీ ! శరీరం కాపాడుకోవాలి!'

'అలాగేనండీ!'

'ఎవరన్నా ఎక్కడ, ఏమి చదువుకున్నావ్! అంటే కాన్వెంట్‌లో అని చెప్పు!'

'అలాగేనండీ! కాన్వెంట్‌లో చదివానని చెప్తాను.'

అప్పలమ్మతో రొమాన్స్ ముగించుకుని మూతి తుడుచుకుంటూ మాగజీన్ ఛుజాన వేసుకుని ప్రవేశిస్తాడు కెమెరా అసిస్టెంటు!

మరలా మొదలు—

దీపాలు వెలిగించి స్టార్ట్ అంటారు—

'ప్రతి రేయి స్త్రీకి అపురూపం!'

రాణి డైలాగ్ చెప్పింది.

'ఓ కే!' అంటాడు దర్శకుడు,

# మసూద్ 7 నెలలకే తనంతట తాను లేచి నిలబడగలిగాడు- తప్పకుండా నాయకుడవుతాడు

మసూద్ తనంతట తానులేచి నిలబడి ఎంత సేపూ ఏదో ఒకటి బోం తోయటానికి ప్రయత్నిస్తున్నాడు. స్పర్శ జ్ఞానం, గ్రహింపు శక్తి, పెరుగుదల త్వరగా వచ్చేస్తున్నాయి. సంగీతమంటే కూడ చాలా ఇష్టంలా ఉన్నది—తన కాలితో తాళం వేస్తున్నాడు! ప్రజ్ఞా విశేషాలు అప్పుడే పొడ చూపుతున్న ఈ చిరు పాప రహస్యం ఒక ప్రత్యేకమైన శిశు ఆహారం.



## మసూద్‌కు అమూల్‌స్ప్రే ఇస్తున్నారు— పేరు మ్రోగిన శిశు ఆహారం.

అమూల్‌స్ప్రే ప్రవేశపెట్టిన రెండు సంవత్సరాల లోన సర్వాధిక విక్రయంగల శిశు ఆహారంగా విశేషమైన అభ్యున్నతిని పొందింది. ఇది ఒక ప్రత్యేక ప్రక్రియ (స్ప్రేడ్రైయింగ్) ద్వారా, ఒక ప్రత్యేక సూత్రము ననుసరించి తయారు చేయబడింది—మీ ప్రత్యేకతగల పాప కోసం. సులభంగా జీర్ణమయ్యే అమూల్‌స్ప్రే సంతులిత ఆహారాన్ని సమకూర్చుతుంది. అవసరమైన విటమిన్లు, ఖనిజములు గలది శారీరక, మానసిక అభివృద్ధికి అధికమైన మేలు రకం ప్రోటీన్లు ఉన్నాయి.




**ఉచిత**
మీ ఉచిత
అమూల్ బేబీ పుస్తకం కోసం
(50 పై తపాలా బిళ్లలు
జతపరచి) పోస్ట్ బ్యాగ్
10124, బొంబాయి-1 కి
వ్రాయండి

# అమూల్‌స్ప్రే

తల్లి పాలకు ఆదర్శవంతమైన ప్రత్యామ్నాయం.

# నిర్మాత-ఫిలిండబ్బాలు

'హీరో! డైలాగ్ అపురూపం! అని— ఆవిడగారేమో అపురూపం అన్నారండి!'

'ఫర్వాలేదు లేవయ్యా! ఎవరు చూస్తారు యిలాంటి చిన్న చిన్న తప్పులు!!'

(పాపం దర్శకుడుగారికి ప్రేక్షకులు వీరికంటే తెలివైనవారని తెలియదు లెండి.)

'అరేయ్ అప్పలస్వామి! అమ్మగారికి టిఫిన్ పెట్టు!' దర్శకుని ఆజ్ఞ!!!

'మా తల్లే! రెండు డబ్బాల ఫిలిమ్ గుటుక్కుమని మింగావ్! యింకా నీకు ఆకలా!'

నిర్మాత స్వగతం!! [పైకంటే కొంప అంటుకోదూ]

ఇక రెండో షాట్—హీరోయిన్ని గట్టిగా గదిలోకి నెట్టి తలుపులు వేయాలి!

(అసలు హీరోయిన్ని చూస్తే రాణికి మంట! తను వెయ్యాల్సిన వేషం యీ ముష్టాతి చొప్పదంటు కొట్టేసింది)

ఎస్ రెడీ! యాక్షన్!!

రాణి హీరోయిన్ కుసుమను గదిలోకి నెట్టాలి—మంచి ఛాన్సు దొరికింది రాణికి—ఒక్క నెట్టు నెట్టింది. అంతే—కుసుమ తూలి గోడకు కొట్టుకుంది—

'ఛీ! బుద్ధి లేదూ—'అంది కుసుమ.

'మాటలు జాగ్రత్తగా రానీ! డైరెక్టర్ నెట్టమన్నాడు—నేను నెట్టాను!' రాణి!

కెమెరా తిరుగుతూనే వుంది—

'ఛీ!నీలాంటిదాంతో మాటలు అనవసరం.'

'ఏమండీ డైరెక్టర్‌గారూ! ఈవిడ నెడితే నేను యాక్టు చెయ్యను—' రుస రుస లాడుతూ మేకప్ రూమ్‌లోకి వెళ్ళిపోయింది నెళ్లే డు—రాణీ నెట్టాల్సిందే!' దర్శకునిగోల!!

నిర్మాతకూ విసుగు వస్తుంది.

'అది సరే—పెళ్ళి లేకుండానే పార్కులో పాటలు పాడిన అమ్మాయి యింత మాత్రం గదిలోకి పోలేదా—' నిర్మాత తిరుగుడు ప్రశ్న—

'పార్కులో పాట పాడినప్పుడు చుట్టూ ఎవరూ లేరు—ఎవరూ లేనప్పుడు వేరు—' దర్శకని సమర్థన!

'పబ్లిక్ పార్కులో సినిమాలో ఎవరూ కనిపించరు—నిజమే!' నిర్మాత ఉగ్రత!

'కుసుమ హనీమూన్‌కి వెళ్ళడం మోడరన్ ఫాషన్! అసలా కార్యం గది సీను మాని అవుట్‌డోర్‌లో కార్‌లో వెళ్ళినట్టు తీస్తే!!' నిర్మాత మరో సలహా—

'పిక్నిక్ లేదు—కార్లోనే పాట పెట్టొచ్చు.'




కుసుమ—ది గ్రేట్ హీరోయిన్.

కెమెరా తిరుగుతూనే వుంది! అంత వరకూ తెల కళ్ళు వేసుకుని చూస్తున్న దర్శకుడు తెలివి తెచ్చుకొని 'కట్' అంటాడు—

మరో ఐదువందల అడుగులు—

నిర్మాతకు తప్పకుండా — మంత్రసాని పని కొప్పుకున్న తర్వాత—

(బతిమిలాడి హీరోయిన్ని పిలుచుకు రావాలి)

నిర్మాత దర్శకునితో— 'ఏమండీ! రాణి నెట్టకుండానే కుసుమను గదిలోకి పంపించండి—'

'అదెలా! కొత్తగా నూతన వధువు బరితెగించి గదిలోకి తనకు తానై వెళుతుందా!

'వెనకసీటులో కుసుమ—హీరో! డ్రైవరు సీటులో రాణి!!' దర్శకుని ఆలోచన.

మరలా రాణి తయారు—

'యిప్పుడు కుసుమను గదిలోకి వెళ్ళమనండి—తర్వాత అవుట్‌డోర్‌లో మీరు చెప్పినట్లు చేద్దాం' నిర్మాత ఆజ్ఞ!!

'మీ యిష్టం! కథ ప్రకారం రాణి నెట్టాలి! సరే! కుసుమా! నువ్వే వెళ్ళు!!'

పెదవి విరిచాడు దర్శకుడు.

శోభనం గదిలోకి నవ వధువుని పంపించడం తేలిక—

కానీ యీ సినీ నవ వధువుని గదిలోకి పంపాలంటే యిన్ని కష్టాలు నిర్మాతకి—బోల్డు ఫిలిమ్ డబ్బాలకొలదీ కావాలి మరి!! ●

# ప్రేమకానుక!

1621లో షాజహాను చక్రవర్తి తన భార్య ముంతాజ్ కు బహూకరించిన వజ్రం—అదే వజ్రాన్ని ఇంగ్లీషు వెండితెర నటుడు రిచర్డ్ బర్టన్ తన భార్య 40వ జన్మదినోత్సవ సందర్భంగా ఆమెకు ప్రేమ కానుకగా యిచ్చాడట. గత 20 ఏళ్ళుగా తాను వజ్రాలు కొనడం వ్యాపారంలో ఎంతెంత మందినో కలిసినట్లూ, తత్ఫలితంగా ఆ వజ్రం తనకు లభించినట్లూ ఆయన చెప్పాడట. అంతే గాక తన భార్య ఎలిజబెత్ టైలర్‌కు ప్రేమ కానుకగా తాజ్ మహల్నే కొని యిచ్చేద్దామనుకున్నట్లూ, కానీ అదంత తేలికయిన పని కాదని యీ వజ్రాన్ని సంపాదించి ఆమెకు ప్రేమ కానుకగా బహూకరించినట్లు కూడా చెప్పాడట—దంపతెగా! ఎంత తెగింపు!

## 12 కిలోల శిశువు – ప్రపంచ రికార్డ్!

నైరుతి ఇరాన్‌లోని షెక్ పూర్‌లో ఫిబ్రవరి ఆయుదవతేదీ మస్సుంవా రీజాదే అనే 32 ఏళ్ళ స్త్రీ తన ఏడవ కాన్పులో 12 కిలోల (26.4 పౌనులు) బరువున్న మగబిడ్డను కని ప్రపంచ రికార్డును బద్దలు కొట్టిందట. ఇంతక్రితం టర్కీలో సావెత్ అనే ఆమె 11 కిలోల శిశువును కని అంతకు ముందున్న రికార్డు పగలేసి, కొత్త రికార్డు స్థాపించిందట.

*   *   *

ఢిల్లీలో జగదీష్ అనే అతను కాకాసింగ్ అనే అతని యింటి వైపునుంచి వెళ్ళుతుండగా ఆ కాకాసింగ్ కుక్క భౌంయ్మని మొరుగుతూ జగదీష్ మీదికి వురికితే అతను ఆత్మరక్షణార్థం ఆ కుక్కను రాళ్ళతో కొట్టాడట. హత్తెరీ నా కుక్కను రాళ్ళేసి కొడ్తావా అవటాని కాకాసింగ్ జగదీష్‌ను కత్తితో పొడిచేశాడట.

బాబోయ్!



# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

జార్జి టవునులో జరుగుతున్న క్రికెట్ ఆటలో ఆటగాడు బంతిని కొట్టడానికి వూపిన బ్యాటు రయ్యిన తిరిగి, అతని వెనుకన ఉన్న వికెట్‌కీపర్ మోహన్‌సింగ్ తలకు తగిలిందట. దాంతో మోహన్ సింగ్ అక్కడికక్కడే చనిపోయాడట.

## 167 ఏళ్ల ఆరోగ్యవంతుడు!

రష్యాకు చెందిన బర్జావు గ్రామవాసి షరాలి బాబామిస్లియెవ్ అనే ఆయనకు రేపొచ్చే మార్చి నాటికి 167 ఏళ్ళు నిండుతాయట. ఈయన యిప్పటికి ఎంతో ఆరోగ్యంగానూ, వుల్లాసంగానూ కనుపిస్తారట. స్వచ్ఛమైన గాలి, మిత—భోజనం, భాషణం, నిశ్చింత, కాయకష్టం: యివే తనకు రక్షలని ఆయనన్నారట. ఇవన్నీ చేసిన వారంతా ఆయన బతికినన్నాళ్ళూ బతుకుతారా! చెప్పిందుకు వీల్లేదు.!

## అతిథిగృహంలో దయ్యాలు!

మైసూరు రాష్ట్రానికి చెందిన చించోలితాలుకా కోడ్లా గ్రామంలో కట్టిన ఓ అతిథి భవనంలోకి అతిథులకన్నా ముందు దెయ్యాలు చేరాయన్న వదంతి పుట్టి, ఏ అతిథులుగాని, అభ్యాగతులు కానీ అందులో దిగసాహసించటం లేదట. ఆ భవనాన్ని 1964 లో 11 వేల రూపాయల ఖర్చుతో కట్టారట. దాని సమీపంలో వున్న జూనియర్ ఇంజనీర్ల క్వార్టర్సులో కూడా ఆ దెయ్యాలు తిరుగుతున్నాయని భయంతో అందులో ఏ ఇంజనీరూ దిగలేదట. రెండు నెలల క్రితం ఓ కుటుంబ నియంత్రణ ప్రచారకర్త గత్యంతరం లేక అందులో దిగారట గానీ, అర్ధరాత్రయ్యే సరికి 'బాబోయ్: దెయ్యం: అమ్మోయ్ దెయ్యం' అని నర్సులు పరిగెట్టుకు బయట కొచ్చేశారట. మనిషికి తనకళ్ళు, తన మనస్సు అలవాటు పడని ఏ కొత్త విషయం చూసినా, విన్నా కాస్త బెదురేగదా! ఇక దెయ్యం అంటే వేరే చెప్పాలా!

## అసభ్యనృత్యాలు–అపరాధాలు

అసభ్య నృత్యాలను నృత్యాల పేరిట హోటళ్ళల్లో చేసి పట్టుబడుతున్నందుకు పాండిచ్చేరిలో ఓ తెలివైన బట్టు యీ నృత్య సభను మామూలు యింట్లోనే కొనసాగిస్తూ వచ్చారట. అర్ధరాత్రి సమయంలో ఆ యిల్లు యువకులతోను వారి కేరింతలతోనూ కళకళా, కిలకిల్లాడుతుండడం చూసి, పోలీసుదాడి చేస్తే లక్ష్మి, శాంతి, నీలావతి, గంగ, సుశీలాదేవి, చిన్నమ్మ అనే ఆరుగురు అమ్మాయిలు దొరికారట. వీరు ఆరుగురూ, శక్తివంచన లేకుండా నగ్నంగా కనబడే తీరులో బట్టలు ధరించి, నృత్యం పేర స్వేచ్ఛాగంతులు వేస్తున్నారట! తస్మాత్ వీరారుగురికీ కోర్టు తలా యాభై మూడు రూపాయలా అపరాధం విధించిందట. ఏ అపరాధాన్నయినా డబ్బు చెల్లింపుతో కొలుస్తే రానురానూ అపరాధాలకు రేట్ల పట్టికలు ఏర్పడవూ..ఏనిన్యా ఏర్మాజ్ వెల్కమ్.. అంతేనా!

## పట్టపగలు రెండు హత్యలు!

సెంట్రల్ కలకత్తాలో ఒక గ్యారెజీలో హర్‌చంద్‌సింగ్ అనే ఓ హాకీ ఆటగాడు, అతని స్నేహితుడు సుదర్శన్‌సింగ్ తమ కారు బాగు చేయించుకుంటుండగా ఓ టాక్సీ అక్కడికొచ్చి ఓ లిప్త ఆగిందట. త్రుటిలో అందులోంచెవరో హర్‌చంద్ సింగ్‌ను, సుదర్శన్ సింగ్‌నూ కాల్చి చంపి, పారిపోయారట. 24వ తేదీన పట్టపగలు జరిగిందిది.

## కుటుంబనియంత్రణకి కొత్త ఉపాయం!

సాధారణంగా స్త్రీ బహిష్టు అయ్యే కాలంతో ఆమెగొంతు స్థాయిల్లో మార్పు వస్తుందని, దీన్ని ఆధారంగా చేసుకుని సంతాన నిరోధనకు కాలం నిర్ణయం చేయవచ్చుని లండన్‌లో డాక్టర్ బి. టి. వైన్ అన్నారట. ఈ విషయాన్ని ఆయన న్యూ సైంటిస్టు అనే పత్రికలో ఓ వ్యాసంలో పేర్కొన్నారట. తను యీ ప్రయోగం తన భార్య మీద చేసినట్టు కూడా ఆయన అన్నారట.



# ఒకవారం విపరీతం

**అన్యాయానికి బలైన అబల!**

నాగపట్టణం స్మశానంలోంచి పోలీసులు వో 18 ఏళ్ళ స్త్రీ శవాన్ని త్రవ్వి బయట పెట్టారట. ఆ స్త్రీ చావు సహజమైనది కాదని, అనుమానించి అది నిరూపించడానికి వీరీ పని చేశారట. ప్రాణాపాయ స్థితిలో ఆమె నెవరో నాగపట్టణం ఆసుపత్రిలో చేర్చారనీ, అక్కడామె చనిపోయాక ఆమెను ఆసుపత్రిలో చేర్చినవారే స్మశానంలో పాతి పెట్టారని పోలీసులు తమ కందిన సమాచారంతో పరిశోధన సలిపారట. పోలీసు కథనం ప్రకారం ఆమె పేరు వసంతట. కుంబకోణానికి చెందిన యీమెను ఎవరో జయినుల్లా బీబీ అనే ఆమెకు అయిదు వందల రూపాయలకు అమ్మితే ఆ బీబీ వసంతను నాగపట్టణం తీసుకువచ్చి, వేశ్యా వృత్తిలో దింప చూసిందట! కాని వసంత ఎంతకీ లొంగకపోయేసరికి, జయినుల్లా బీబీ ఆవేశంతో వసంతను చావబాది, చావు బ్రతుకుల మీద ఆమెను నాగపట్టణం ఆసుపత్రిలో చేర్పించదట. ఆమె యింటి మీద జరిపిన దాడిలో వో 18 మంది ఆడపిల్లలు కూడా దొరికారట. జయినుల్లా బీబీ మాత్రం దొరకలేదట.

**మంటలలో చిక్కుకుని ముగ్గురు పిల్లల మరణం**

కర్నూలుకు 65 కిలోమీటర్ల దూరంలో




వున్న అమలాపురం అనే వూరిలో వో పన్నెండేళ్ళ పిల్ల తన యిద్దరు తమ్ముళ్లనూ కూర్చోపెట్టుకుని, పాకలో కందులు వేయిస్తుండగా వో నిప్పురవ్వ ఎగిరి పక్కనే వున్న గడ్డిమేటు మీద పడి, క్షణంలో మండి, ఆ మంటలు తాటాకు పాకకూ తగిలి లేచాయట. తత్ఫలితంగా ఆ ముగ్గురు పసిపిల్లలూ మలమల మాడి చనిపోయారట.

**ఆవేశంలో పిల్లలని పొడుచుకున్న భార్య**

ఢిల్లీ ఖేరా గ్రామానికి చెందిన జైలాల్ అనే ఆయన తనకు వివాహమై నాలుగేళ్లయినా, భార్య మూర్తి సంతానవతవలేదని, ఆమె చెల్లెలు శాంతిని వివాహం చేసుకున్నాడట. కాల గమనంలో శాంతికి ఏడుగురు పిల్లలే కాక, మూర్తికి యిద్దరు పిల్లలు కూడా కలిగారట. అయినా ఆమెకూ ఆమె భర్తకూ

ఎన్నడూ పడేది కాదట. మొన్న 23వ తేదీ ఏదో ఘర్షణలో మనస్సువిరిగిన మూర్తి తన ఇద్దరు పిల్లలతో సహా నూతిలో దూకిందట. ఆ శబ్దం విని చుట్టుపక్కల వారొచ్చి ఆ ముగ్గుర్నీ బయటకు తీస్తే ఒక్క మూర్తి మాత్రమే బ్రతికిందట— ఎందుకు పాపం! హత్యా నేరం, ఆత్మహత్యా ప్రయత్నం భరించేందుకా!..

* * *

**భార్యచేసిన అవమానం భర్త ఆత్మహత్య**

ఆదిపెరుమానూరుకు చెందిన 38 ఏళ్ల మునిసామిగవుండరుకు యిద్దరు భార్యలట. రెండో భార్య గవుతమ్మతో వచ్చిన పోట్లాటలో ఆయన ఓ కత్తి తీసుకుని గవుతమ్మను పొడిస్తే గవుతమ్మ మరో కత్తి తీసుకుని ఆయన్ను పొడిచిందట. భార్య చేతిలో కత్తిపోటు తిన్న అవమానాన్ని భరించలేక మునిసామిగవుండరు పురి పోసుకుని ఆత్మహత్య చేసుకున్నాడట.

బ్యారసంద్ర అనే చోట ఆగివున్న ఓ రెండెడ్ల బండికింద ఆరేళ్ళ శంకరం అనే కుర్రాడూ అతని స్నేహితుడూ చేరి ఆటలాడుకుంటున్నారట. ఈలోగా వున్నట్టుండి ఆ బండి బయలుదేరటంతో శంకరం ఆ బండిచక్రం క్రిందపడి, నలిగి, చనిపోయాడట. ●

# ప్రశ్నోత్తరం

...కె. రామలక్ష్మి...

**వి. ఎస్. ఎమ్. విజయనగరం**

**రామలక్ష్మిగారూ, నేను చాలా నల్లగా ఉంటాను. నేను ఎక్కడికేనా వెడితే 'చూడ్రా ఎంతనల్లగా ఉందో' అంటారు. నేను ఎక్కడికీ వెళ్లడం మానుకొన్నాను...**

ఏం యిప్పుడు 'చూడ్రా ఎలా యింట్లో కూర్చుందో' అండంలేదా? చిట్టితల్లీ—భయపడే వాళ్లని అంతా భయపెట్టాలనే చూస్తారు. నేనూ నల్లగానే ఉంటాను. కాని ఎవరూ చూడ్రా అనలేదు నన్ను. అన్నీ వినిపించుకుని ఉండను. ప్రపంచంలో ఎదుటి వ్యక్తిని విమర్శించడం అన్నంత సులభం యింకొకటేదీ లేదు. నల్లగా ఉంటే నలుపంటారు. తెల్లగా వుంటే తెలుపంటారు. మీరు దేనికని బాధపడ్డం? ఫర్‌గెట్ ఎబవుట్ యువర్ కాంప్లెక్షన్. మీకు మీరు నలుపన్న సంగతి మరిచి పోతే—లోకం అదే మరిచిపోతుంది! లోకానికీ వేరే పన్లుంటాయి.

**జె. ఎస్. ఆర్. విశాఖపట్నం**

**మాటకి విలువెంత ?**

ఈ రోజుల్లో ప్రతి దాని ఖరీదూ తెలిసినట్టు విలువ తెలియదు సార్.

**కె. ఆర్. నర్సాపురం**

**అక్కయ్యా నాకు కథలు రాయాలని విప్పటినించో సరదా. కాని కథ ఎల్లా మొదలు పెట్టాలో తెలియడంలేదు...**

తెలిసిన వాళ్లచేత రాయించుకో చిట్టి చెల్లెలా. నీసరదా తీరుతుంది. వారికి నాలుగు రాళ్లూ ముట్టుతాయి.

**వి. ఎస్. ఆర్. గుంటకల్**

**నేటి పురుషులు మగువ మధువు లేనిదే జీవించ లేరంటాను ? మీరేమంటారు ?**

మీరలా ఛాలెంజి చేస్తూంటే నేనేమనగలను? డబ్బుంటే తప్పించి—రెండూ సాగవంటాను.

**ఎస్. ఆర్. కె. హిందుపురం**

**గురువుమ ఈ ప్రపంచంలో ఏ వస్తువుతో పోల్చవచ్చునండీ ?**

గురువులింకా ఈ ప్రపంచంలో సజీవ పదార్థాలు నాయినా ? వస్తువులుగా మార్చేయకు.

**టి. ఎస్. బి. తిరుపతి**

**ఎవరిహద్దుల్లో వారుండడం మంచిదని గ్రహించండి. విప్లవ కవిత్వాన్ని గురించి నోటికొచ్చినట్టు మాట్లాడకండి... కవికి 'అతని రచనే ఆచరణ' అని గ్రహించండి.**

శహబాష్ స్వతంత్ర భారతిగారూ, ఆనిర్వచనం ఒక్క విప్లవ కవులకేనా— ఇతరులకి కూడా వర్తిస్తుందా....అయితే — నా స్లోగన్స్ అన్నీ నా ఆచరణేసార్! విప్లవం నా ఊపిరి. నమ్మండి!!

**వి. కె. ఆర్. వైజాగ్**

**విశ్వాసంలేని మనిషిని ఏమవాలి ?**

విశ్వాసం లేక పోతే ఫరవాలేదు. అవకాశాన్ని అవసరాన్ని పట్టి మార్చే మనిషినే— బ్రతకనేర్చిన వాడనవచ్చు.

**టి. ఆర్. కె. కాకినాడ**

**ఆడవారిని చదివించడంలో మీ అభిప్రాయం ఏమిటి ?**

కన్నందుకు చచ్చినట్టు తిండి పెడుతున్నారా లేదా. అలాగే చదివించండి.

**కె. ఎమ్. ఎల్. గుంటూరు**

**చదువుకుని ఉద్యోగం చేసేస్త్రీకి విలువ ఎక్కువాలేక పెళ్లి చేసుకుని కాపురం చేసేస్త్రీకి విలువ ఎక్కువా ?**

పెళ్లిచేసుకొని కాపురం చేస్తూ ఉద్యోగంచేసే స్త్రీకే యీ రోజుల్లో విలువ ఎక్కువ అనిపిస్తూంది.

**ఎ. జి. ఎస్. ఆర్. అనంతపురం**

**జీవితంపై విరక్తి కల్గిన వారికి మీరిచ్చే సలహా ?**

ఆ విరక్తిని తోసిరాజనమని.

**ఎమ్. జి. ఎస్. తుని**

**ఏమండీ, మీరొకసారి తల్లివేషం వేయరూ?**

తల్లివేషం నాకు నప్పదోయ్ గుణసుందరీ!

**ఎస్. ఎస్. బి. హైదరాబాదు**

**స్త్రీకి భర్తే దైవంకదా. మరి నేటి సమాజంలోని కొందరుస్త్రీలు తమ భర్తల పట్ల గౌరవం చూపడంలేదు. ఎందుచేత ?**

గౌరవం చూపకపోవడం అంటే ఏమిటో నాకర్థం కావడం లేదు. పడి పడి దండాలెట్టడమా? మనిషి ఎదురయితే ఒణికిపోవడమా? భర్తే ప్రత్యక్ష దైవం అంటూ పరోక్షంలో దెయ్యాన్ని చూసినట్టు దడవడమా? ఏది గౌరవం. ప్రియ బాంధవుడూ, సఖుడూ సాటి మనిషిలా భర్తని చూడడం, గౌరవం చూపక పోవడం అనిపించు కుంటుందా? మీలాంటి వాళ్లు కొంచెం—నిర్వచించాలి.

**టి. ఎల్. ఎమ్. గుంటూరు**

**నీతి నిజాయితీగల వ్యక్తికి చివరకు మిగిలేదేమిటి ?**

నీతి నిజాయితీలు!

**పి. బిహెచ్. పిఠాపురం**

**మీరిచ్చే జవాబులు సహజంగాను సరళంగానూ ఉండటంలేదని నా అభిప్రాయం.**

ఇది కమ్యూనిస్టు రాజ్యం కాదు—మీ అభిప్రాయానికి మీకు హక్కుంది.

**కె. ఆర్. జగ్గయ్యపేట**

**నేను ఏక పాత్రాభినయం బాగా చేస్తాను.**

ప్రతి తల్లీ— యింట్లో చేసేదే అది. పెద్ద గొప్ప కాదు.

**ఎస్. ఎస్. ఆర్. విశాఖపట్నం**

**కత్తికి కలంకీ దగ్గిర సంపర్కం ఉందంటారా !**

అంటున్నారు— విరసంవారు.

**ఆర్. జి. బి. గుత్తి**

**ఏమండీ, సంక్రాంతికి భోగినాడు మీ యింట్లో ఏం పిండివంటలు చేస్తారు?**

పిండివంటలులేవు. నాకు భోగి పళ్ళుపోశారు.

'మళ్ళీ వోరిత్తావంటే జాగ్రత్త.'

'ఏం. బెదిరిస్తున్నారా?' ఆ మాటే వంద సార్లంటాను. ఏం చేస్తారేం?'

'ఏదీ...అను చూద్దాం'

'కట్టుకున్న భార్యకి రెండేళ్ళయినా ఒక్క చీర కొనిచ్చే తాహతులేదు. మళ్ళీ పెలగబెడుతున్నారు గొప్పగా...గవర్నమెంటు ఉద్యోగం...'

మధ్యలోనే విజయ చెంప ఛెళ్ళుమని పించాడు. 'ఛీ...నా ఎదుట నుంచి...ఈ ఇంట్లో ఒక్కక్షణం ఉన్నావంటే ...' కట్టలు తెగిన ఆవేశంతో మాటలు రాక ఆగి పోయాడు భానుమూర్తి.

'మీరు రమ్మనగానే వచ్చి పొమ్మంటే పోటానికి నేనేమీ ఆటబొమ్మని కాదు. ఈ ఇంట్లో మీకెంత హక్కుందో నాకూ అంతే ఉంది. నా ఇష్టమైన రోజున మీరు వెళ్ళొద్దన్నా వెళ్ళి తీరతాను. ప్రస్తుతం అనవసరంగా ఆవేశపడి, గొంతుచించుకుని అరచి శ్రమపడకండి! ఆడదానిపై చెయ్యి చేసుకున్న మీదీ ఒక పౌరుషమే...'

'నోర్మూయ్! ఛ ... నీతో వాదించటం నాదే బుద్ధి తక్కువ ... ఏకులా వచ్చి మేకయి కూర్చున్నావు'

'నేనేమీ కోరి రాలేదు. రంభా ఊర్వశి లని తలదన్నే అప్సరసవు. అందాల భరిణవు. నా పాలిట దైవం ప్రసాదించిన అదృష్టదేవతవు. నీవు లేనిదే నా బ్రతుకు శూన్యమయి పోతుందంటూ దీనంగా ఫోజు లిచ్చి నా జీవితం నాశనం చేశారు; అన్నీ గుడ్డిగా నమ్మేశాను. 'మా బడుద్దాయిని చేసుకుని నువ్వేం సుఖపడతావే అమ్మలూ' అని అత్తయ్య పోరినా కాదని పోరాడి మిమ్మల్ని చేసుకున్నాను. చేసుకున్నందుకు అనుభవిస్తున్నాను...'

'నువ్వేమీ అంత తలకొట్టుకుని బాధ పడక్కర్లేదు. రేపే విడాకులిచ్చేస్తాను. రోజుకో పట్టుచీర, నెలకొక కారు కొన గలిగే కోటీశ్వరుణ్ణే చేసుకో!

'ఆ అదృష్టమే ఉంటే ఈరాత రాకుం, డానే ఉండేది.' రోషంతో మంట పెడుతున్న చెంపని కూడా లెక్క చేయకుండా మాట్లాడేస్తోంది విజయ.

'ముందు ఇంట్లోంచి పోతావా, లేదా? అసహనంగా అరిచాడు మూర్తి.

'లేదు. నా యిష్టం. మీరు నన్నేమీ చేయలేరు. 'విడాకులు' పొందటం సులభం అనుకుంటున్నారేమో... అవి కూడా నా అంగీకారం లేనిదే జరగవు తెలుసుకోండి!'

'అవును. నీ దగ్గరే తెలుసుకోవాలి అన్నీ...'

''లా' చదివిన మీకు నేను చెప్పేదే ముంది. అన్నీ తెలిసిన మహానుభావులు!'

ముందుపడిన జడని విసురుగా వెనక్కి వేసుకుని, చీర కుచ్చిళ్ళు పైకెత్తి దోపు కుంటూ పెరట్లోకి వెళ్ళిపోయింది



# ఏడాకులు

విజయ. ఆమె నిర్లక్ష్య వైఖరికి మూర్తి అహం దెబ్బతింది 'ఛ... ఆడదానికి ... అందులో పెళ్ళయిన ఆడదానికి ఇంత పొగరా? అది ఎన్నాళ్ళుంటుందో నేనూ చూస్తాను. రెండేళ్ళనుంచి...అంటే కాపరానికి వచ్చిన దగ్గర్నుంచి ఎప్పటికైనా ప్రవర్తన మార్చుకోకపోతుందా అని ఓపిగ్గా ఎదురు చూశాడు. ఇక తనలో కూడా ఓర్పు నశించిపోయింది. ప్రతి చిన్న విషయంలో వ్యతిరేకభావాలతో రేగిన కలతలతో, కలహాలతో ఈ సంసారం నిలుపుకోవటం తన కింక సాధ్యం కాదు. ఏమైనా సరే విడాకులిచ్చేయాలనే నిర్ణయానికి వచ్చేశాడు. వెంటనే 'ఎలా?' అన్న ప్రశ్న తారాజువ్వలా లేచింది.

ముఖ్యంగా ఆమె అంగీకారం కూడా కావాలి...ఆపైన ఇద్దరి మధ్య కనీసం అయిదారు నెలల ఎడబాటు ఉండాలి. ఆ తర్వాత చేతిలో రెండు మూడు వందలైనా ఉండాలి. ఇవన్నీ సాధ్యమయే పనులేనా? చదవటానికి 'లా' చదివాడు కాని అది పూర్తయే సమయంలో తండ్రి చనిపోయాడు. ఆలోచించి ఏదైనా చేయటానికి కూడా వ్యవధి లేకుండా ముష్టి గుమాస్తా ఉద్యోగం దొరికింది. తండ్రి జి. పి. ఎఫ్. తో చెల్లెలి పెళ్ళి చేసేసరికి లోతలు దిగివచ్చారు. పైన వెయ్యి రూపాయలు అప్పు కూడా అయింది. జీవితమంతా ఈ బెత్తెడు లోకతో గడపటమెలాగా అని ఆలోచించి చివరికి విజయని చేసుకోటానికి నిర్ణయించుకున్నాడు. ఒక్కతే కూతురు... ఆమెకు సంక్రమించబోయే ఆస్తి చూసి కట్నం లేకుండా మేనరికానికి ఇష్టపడ్డాడు. తర్వాత విజయే ఈ ముష్టి ఉద్యోగం మానిపించేసి ఏ బిజినెస్సో పెట్టిస్తుందని ఆశపడ్డాడు. ఆ దురాశలో స్వర్గాన్ని కాలదన్ని నరకానికి ప్రయాణం కట్టాడు. దారిలో గడిపిన మూడుసంవత్సరాలు ఒకెత్తు, అచ్చం నరకంలో గడుపుతున్న ఈ రెండు సంవత్సరాలు ఒకెత్తు!

విజయ చిన్నప్పట్నించి పెంకి పిల్ల! అందుకు తలిదండ్రులు చేస్తున్న అతిగారమే కారణమని దగ్గర, దూరంవాళ్ళు చెవులు కొరుక్కున్నా, ఆ చెవులవంక కన్నెత్తయినా చూడకుండా కొట్టిపారేశారు ... దేనికదే చెప్పుకోవాలి. అన్నిటితోపాటు చదువులో కూడా చురుగ్గానే ఉండేది విజయ. అందుకే అయిదేళ్ళు తనకంటె చిన్నదయినా ఇద్దరూ మెట్రిక్ పరీక్షకి ఒకేసారి కూర్చున్నారు. పరీక్షకి కూర్చోవటం తన కది మూడవ సారే అయినా మళ్ళీ తప్పాడు. విజయ పాసయి పి. యు. సి. లో చేరింది అప్పటికే అన్ని విషయాల్లో తన మీద అథారిటీ చెలాయించేది.

'నీ చదువంతా 'పైనియర్ ప్లాన్స్'లో జరిగేట్లుంది. బావా' అంటూ ఎగతాళి చేసింది. తను పి. యు. సి. లో అడుగు పెట్టగానే ఆమె అది దాటేసింది మామయ్య బి. ఏ. చదవమంటే 'ఇంక చదవను పెళ్ళి చేసుకుంటా'నని ఖచ్చితంగా చెప్పేసింది. 'ఎవరిని' అని వాళ్ళు అడగకముందే కరివేపాకుకోసం వెళ్ళిన తనని నిల్చోబెట్టేసి అందరిలో 'నిన్నే చేసుకుంటాను' అనేసింది. అత్తయ్య, మావయ్య కూతురి గడుసుతనానికి మురిపెంగా నవ్వుతూంటే తను సిగ్గుపడిపోతూ పరుగెత్తుకుని ఇంటికి వచ్చేశాడు

ఆమె తనని చేసుకుంటాననటానికి కారణం మెట్రిక్ నాలుగోసారి పరీక్షలో పాసయిన సంతోషంలో తానామెకి వ్రాసిన 'లవ్ లెటర్' లాంటి ఉత్తరమే కారణమయి ఉంటుందని గ్రహించటానికి తన మట్టిబుర్రకు చాలారోజులు పట్టింది. ఈ లోపల విజయ తను రోడ్డుమీద కనిపించినప్పుడల్లా అప్పుడే సర్వాధికారాలు తన పరమయినట్లు నిలేసి చివాట్లు పెట్టేది. 'అలా రోడ్లు పట్టుకుని తిరగకపోతే ఫస్టు ఛాన్స్‌లో కాకపోతే కనీసం సెకండ్ ఛాన్స్‌లోనైనా పి. యు. సి. పాసవటానికి 'ట్రై' చేయకూడదూ!' అంది. మరోసారి 'యూనివర్శిటీ వాళ్ళకి ఎన్నిసంవత్సరాలకి 'బాండ్' రాసిచ్చావేం?' అంటూ వేళాకోళం చేసింది. అసలు చిక్కు ఇద్దరి ఇళ్ళు ఒకే వీధిలో ఉండటం వచ్చింది. అమ్మ బలవంతంమీద కరివేపాకు దగ్గర్నుంచి చివరికి పెళ్ళికొడుకుని చేసిన రోజున కళ్యాణతిలకం వరకు వాళ్ళింటికే వెళ్ళాల్సి వచ్చింది. దానికి తగ్గట్లు బావమరదుల మధ్య మమత మల్లెపందిరిలా అల్లుకుని పూలు పూయటమే కాని పార్టీలు, పంతాలు లాంటి తెగుళ్ళేమీలేవు. 'ఆ యింటిమీద కాకి ఈ యింటిమీద వాలదు' అనుకోటానికి చుట్టుపక్కలవాళ్ళకెప్పుడూ అవకాశం కలిగేది కాదు. రెండు ఇళ్ళమీద కాకులు ఎప్పుడూ కలసే ఉండేవి. అందుకే 'విజయ నన్ను చేసుకుంటుందట, నాన్నా' అనగానే అక్కడే ఉన్న మావయ్య 'మీ ఇద్దరికీ ఇష్టమయిన తర్వాత మాదేముంది' అనేశాడు. దానికి 'తందాన. తాన' అంటూ వంత పాడేరు నాన్నగారు.

ఒక్కటే ఆడపిల్ల. ఉన్నదంతా దానిదే. అంటూ పైసా కట్నం, కానీ లాంఛనలు లేకుండా పెళ్ళి జరిపించేశారు. 'పైగా ఇద్దరూ కలసి చదువుకోండి' అన్నారు. తనకీ ఇంచక్కా ఇద్దరూ కలసి కాలేజీకి వెళ్ళాలని సరదా వేసింది. కాని విజయ మొండిగా 'నీతో కాలేజీకే కాదు నువ్వు బి. ఏ. పాసయేవరకు కాపరానికే రానన్నది. దానితో అభిమానం, రోషం

## ఉగాది

ఉగాది చైత్రనవోదయము  
వసంతరాగ సుధామయము!  
నవోల్లసిత ధీరస్మేరాంకుర  
విలాస రేఖా విలసనము!!

మనోజ్ఞ జీవన బృందావన మం  
దానిల సంగీతోత్సవము!  
రసానంద మకరంద బిందు సం  
సిక్త షట్పదజ్యారవము!!

లసన్మంజుతరులతావితాన వి  
లాస్యదమల సుమనికుంజము!  
పరిమళ విస్ఫూర్త్యారాభినవ పా  
రిజాత సుందర నందనము!!

రసాల కిసాల యాస్వాద కషా  
యిత కంఠకుహూకలరుతము!  
నవస్ఫురత్స్వరభోద్గిరత్ కో  
యమాన మల్లీ శోభితము!

భవిష్యదమృత మహాజీవన మం  
టప మంగళ మణితోరణము!  
మహాకావ్య జీవన పాంథావళి  
నితాంత శుభాభినందనము!!

ఉగాది చైత్ర నవోదయము!  
వసంతరాగ సుధామయము!!

—'కవితాశ్రీ'

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి !

చదువుల్లో ఆటల్లో హరింపు అయే శక్తిని పిల్లలకు
తిరిగి సమకూర్చకపోతే వారి మానసిక శారీరక
వికాసానికి ఆటంకం కలుగుతుంది ప్రతి దినం వారు
బోర్న్‌విటా త్రాగటం వలన పిల్లల శక్తి పెరుగుతూ
ఉంటుంది. పుష్టికరమైన కోకో, పాలు, మాల్ట్
మరియు పంచదారలతో తయారైన
బోర్న్‌విటా రుచికరమైనది.




## శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా!

ముందుకువచ్చి బి ఏ అత్యెసరు మార్కు లతోనే అయినా సరిగ్గా మూడేళ్ళలోనే డిగ్రీ తీసుకున్నాడు. అంతటితో ఆగక తడాఖా చూపించాలని పట్టుబట్టి బి. యల్. లో చేరాడు. అది పూర్తవక ముందే దురదృష్టం తరుముకు వచ్చింది. తండ్రి మరణంతో 'లా' కి స్వస్తి చెప్పి ఉద్యోగ ప్రయత్నాలకి 'నాంది' పలికాడు. గుమాస్తా గిరే అయినా అదీ మామయ్య పరపతితో సంపాదించుకున్నదే! చెల్లెలు కూడా అత్తగారింటికి వెళ్ళిపోవటంతో 'ఇల్లు మరీ బోసిగా ఉంది కోడలిని తీసుకువచ్చేయి' అంది తల్లి. తనూ కాదన లేక పోయాడు. ఎలాగో ఆమె పెట్టిన గడువు తీరిపోయి సంవత్సరమవుతోంది. ఇప్పట్లో తన పట్టుదలమీదే తీసుకు రాలేదు అనుకుంటుండగానే మామయ్య విజయతో గుమ్మంలో ప్రత్యక్షమయాడు. కాపరానికివచ్చిన 'క్రొత్త' ఆర్నెల్లవరకు సాగిన జీవితంలో మధురిమ ఉందని రహస్యం చెప్పింది. ఆ తర్వాత ఒక్క 'మొట్టి కాయ'ల విషయంలో తప్పించి చిన్నప్పటి లాగే అనిపించింది ఆమె ప్రవర్తన.

కోడలు కాలుపెట్టిన వేళావిశేషం పుట్టిన దగ్గర్నుంచి ఉన్న ఊర్నుంచి వెళ్ళగొట్టింది. తనకు విజయవాడ ట్రాన్స్ ఫరయింది. మూడోనాటికి ముగ్గురూ ఈ ఊరొచ్చి పడక తప్పలేదు. తల్లి,

# విడాకులు

తండ్రిని వదిలి వచ్చిందని అమ్మ మరీ గరాం చేయటంతో మరీ రెచ్చిపోయింది. నోటికి ఎంతమాట వస్తే అంతా అనే యటం, వద్దన్నది చేస్తాననటం, చేయ మన్నది చేయననటం, ప్రతి చిన్నవిషయం లోనూ తనకి వ్యతిరేకంగా వాదించటం మొదలు పెట్టింది.

ఆఫీసునుంచి రాగానే కాఫీ ఇవ్వటానికి అరగంట పట్టేది. అదేమంటే 'ఇక్కడెవరూ నౌకర్లు లేరు అన్నీ రెడీగా ఉంచ టానికి' అని తక్కువ నోరూ మూయించేది. అమ్మకి గుడిసి రెండు సంవత్సరాలు ఓపిక పట్టాడు. ఇంక తనవల్ల కాదు.

అసలింతకీ నెలాఖరులో 'దీపావళి' తగుదునమ్మా అని రావటం వచ్చింది చిక్కు. పోనీ తెలియక వచ్చిందే అను కోండి. అన్నీ తెలిసిన ఈ ఆడమనిషికి జ్ఞానం, బుద్ధీ ఉండొద్దూ! గుమాస్తా మొగుడి సంపాదనలో ఒక్కసారే రెండు వందల యాభై రూపాయలు ఖరీదుగల పట్టుచీర ఎలా వస్తుందన్న ఆలోచన ఏడవద్దూ! క్రిందటి సంవత్సరం 'క్రొత్త కాపురం. మొదటిపండగ' అని పుట్టింటి వాళ్ళు పెట్టిన రెండు పట్టుచీరలు అంతకుముందు నాలుగేళ్లలో కొనుక్కున్నవి, అన్నీ అన్నిరకాల చీరలు కలిపి ఇంకా వాడకుండా, పెట్లోనవడి నలిగి వరకు మూల్గుతున్నాయి. అయినా తనుమాత్రం ఏమన్నాడని! ఒక్క నెలలో అంత ఖర్చు పెట్టటం కుదరదు సంక్రాంతి పండక్కి కొని పెడతాను అన్నాడు. అన్నంతమాత్రాన 'దైవం లాంటి మొగుణ్ణి పట్టుకుని అన్ని మాట లంటుందీ?

'ఈ జన్మకి మీ సంపాదనతో చీర కొనుక్కుని సింగారించుకునే భాగ్యం కూడానా? అయ్యోరామ! ఖర్మ పెళ్ళయి ఆరేళ్ళవుతున్నా ఇంకా అన్నీ పుట్టింటి నుంచే దేవిరించుకుని తెచ్చుకోవాల్సి వచ్చింది. అయినా ఈకాలం ఆడవాళ్లకి అభిమానాలు ఎక్కడివి? 'దెంచా' దగ్గర్నుంచి 'స్టీలు' బీరువా వరకు అత్తగారి దగ్గర్నుంచి రాబట్టాలని దురాశే! ఉన్న దాంట్లోనే అన్నీ ఏర్పరచుకుందామన్న ఇంగితజ్ఞానం ఉంటేగా!' ఇలా చాలాచాలా నోటికి వచ్చినట్టు అనేస్తుంటే రెండు రోజుల క్రిందట వాళ్ళ ఆస్తివివరాలు అడ గటమే తప్పయిందని మనసులోనే లెంపలు వాయించుకుని పైకి నోరుమూసుకున్నాడు. 'ఆస్తి' ఉన్నదనేగా అంత గర్వం? ఛీ! ఆ పాపిష్టి ఆస్తికోసం కోరి కోరివిని తెచ్చుకున్నాడు. 'విడాకులే' దీనికి పరి ష్కార మార్గం. అస్తి రాకపోతే పీడబోయె. తన పౌరుషమంతా పురుగులా తొలిచేసి, మనశ్శాంతిని మాయం చేస్తోంది. కాని ఎలా? విడాకులంటే మాటలా?

ఆలోచనలు తిరిగి మళ్ళీమొదటికిరావటం గ్రహించి విసుగ్గా లేచిపోయాడు భాను మూర్తి. చెప్పులు తొడుక్కుని వీధిలోకి నడిచాడు. అనుకోకుండా చిన్ననాటి మిత్రుడు తారసపడి ఇంటికి చేరుకునే సరికి పది దాటింది;

చాపమీద పడుకుని ఆదమరచి నిద్ర పోతోంది విజయ. నాలుగురోజులు అలా ఏమీ పట్టించుకోనట్టుంటే సరి గర్వం అణుగు తుంది. అనుకుంటూ మంచం మీద వాలాడు. ఉదయం మెలకువ వచ్చేసరికి ఏడున్నరయింది. ఈ మధ్యాహ్నరోజు ఆఫీసులో ఇనస్పెక్షన్ ఎనిమిదింటికే రమ్మని చెప్పాడు ఆఫీసరు. మొదటిరోజే ఆలస్యంగా వెళ్తే ఏమంటాడో... ఎప్పటిలా విజయ ను పక్షారం పాడక పోవటమే తను త్వరగా లేవలేక పోవటానికి కారణమనుకుంటూ



# విడాకులు

ఎప్పటిలా ప్రవర్తించినా నొచ్చుకోకుండా చిర్నవ్వుతో సర్దుకుపోయాడు. అతడి శాంత స్వభావానికి, సహృదయానికి మురిసిపోయిందే కాని తన వ్యతిరేక స్వభావాన్ని, మొండితనాన్ని, గడసరితనాన్ని మార్చుకోలేకపోయింది. చిన్నప్పట్నించి తన స్వభావం బావకి తెలిసిందే కదా అనుకుంది కాని, పరిస్థితి ఇలా విషమిస్తుందని ఊహించలేకపోయింది. నిజంగా తప్పు తనదే. ఈసారే కాదు అసలెప్పుడు తప్పు తనదే! అయినా అలా అని అంగీకరించే స్వభావం కాదు. గనకనే ఈ గొడవంతా! పండక్కి కోరిన చీర తేలేకపోయినంత మాత్రాన ఎన్ని మాటలంది. అనవసరంగా ఆవేశపడింది. ఇంకా పెదవుల మీద చెరగని చిరునవ్వు చూసి మరీ రెచ్చిపోయింది అతడి మగతనాన్ని సవాల్ చేస్తూ మాట్లాడింది ఎంత బుద్ధమూర్తయినా ఎంతకని ఓర్చుకోగలడు? ఈ మాత్రం గ్రహించగలిగిన తెలివి ఆ రోజు తనకెందుకు లేకపోయింది. మనసు విరిగి నిజంగానే విడాకులకోసం ప్రయత్నంలో కోర్టు చుట్టూ తిరుగుతున్నారేమో! ఇప్పుడేం దారి? భగవాన్! నాదెంత దురదృష్ట జీవితం! పెళ్ళయిన దగ్గర్నించి అతడిని, పుట్టిన దగ్గర్నుంచి తలిదండ్రుల్ని ఎన్నో విధాలుగా వేధిస్తూ, బాధపెట్టింది. కన్న పేను అన్నిటికీ ఓర్చుకుని క్షమించినా, కట్టుకున్నవాడికేం పట్టింది? ఆలోచిస్తున్న కొద్దీ విజయ గుండెల్లో బరువు పేరుకోసాగింది 'తన కిష్టం లేకపోయినా బలవంతంగానైనా సంతకం చేయించుకుంటాడేమో' అనుకుంటుంటే దుఃఖం ఉప్పెనలా ముంచుకు వచ్చింది.

'అమ్మాయ్ గదిలో ఏం చేస్తున్నావే ఒక్కదానివీ! ఉదయం అనగా పోయినవాడు దీపాలు పెట్టినా అయిపు లేడేమే!'

అత్తగారి మాటలు వింటూనే కన్నీళ్ళు తుడుచుకుని గబుక్కున లేచింది. కొడుకు రాకపోవటం తన తప్పే అయినట్లు మాట్లాడుతున్నట్లనిపించి కోపం బుస్సున పొంగింది. మరుక్షణంలో తనున్న పరిస్థితి గుర్తు వచ్చి చప్పున చల్లారిపోయింది.

'వాడికోసం కూర్చుంటే అయినట్లే. రేపు నాగులచవితి కూడా. పెందరాళే ఇంత తిని పడుకో చీకటితో లేవాలి' అంటూ వెళ్ళిపోయిందావిడ

ఆమె మాటలు విజయకి అయిదేళ్ళ క్రిందటి సంఘటనని గుర్తుకు తెచ్చాయి. ఆ రోజు నాగులచవితి. అప్పటికి తనకి పెళ్ళయిన క్రొత్త! ఇరుగుపొరుగు స్నేహితురాళ్ళందరితో పుట్టలో పాలు పోయటానికి వెళ్ళింది. అమ్మ బలవంతం మీద పెళ్ళి చీర కట్టుకుని తలనిండా చామంతులు పెట్టుకుంది. పుట్టలో ఆవు పాలు తన చేతి మీదుగా పోయిస్తూ 'మీ ఆయన పేరు కూడా చెప్పి పొయ్యవే' అంది. తను సిగ్గుపడుతూ తెచ్చిపెట్టుకున్న గంభీరతతో అలాగే చేసింది. ఆ తర్వాత 'పచ్చి నూకలు పుట్ట మీద వేయిస్తూ నూకల్ని తీసుకుని మూకల్ని మాకివ్వమని' అనమంది అమ్మ. ఆ క్షణంలో అర్థం తెలియకపోయినా వెంటనే అనేసింది. స్నేహితురాళ్ళందరూ ఫక్కున నవ్వితే తెల్లబోయి తర్వాత తమాయించుకుంది. 'అప్పుడే పిల్లల మీద మనసయిందేం' అంటూ వేళాకోళం చేసారందరూ. తాను నిండుమనసుతో కోరలేదని నాగేంద్రుడికి కోపం వచ్చిందేమో! కాపురానికి వచ్చి రెండేళ్ళయినా తల్లి కాలేకపోయింది. తనతో పెళ్ళయిన వాళ్ళందరూ ఇద్దరు, ముగ్గురు పిల్లల తర్వాత ఫామిలీ ప్లానింగ్ కూడా ఆచరిస్తున్నారు. తనకింక ఆ అవసరమే లేదేమో!' తెగిన దారాల్లా సాగిపోతున్న ఆలోచనలకి నిద్రాదేవి ముగింపు చెప్తూ జోకొట్టింది.

భానుమూర్తి ఇంట్లో అడుగు పెట్టేసరికి మామూలు ప్రకారం పదికొట్టింది గోడ గడియారం. అన్నం తినేసి గదిలోకి వచ్చాడు చాపమీద నిద్రపోతున్న విజయ ముఖంలో దీనత్వం గూడు కట్టుకున్నట్టుంది. సున్నని చెంపల మీద ఎండిపోయిన కన్నీటిచారికలు వెన్నెల క్రీనీడలో లీలగా కనిపిస్తున్నాయి. వారం రోజుల తర్వాత తేరిగ్గా, పరీక్షగా చూశాడు మూర్తి. 'పాపం ఈ వారం రోజుల్నుంచి తనని తప్పించుకుని తిరుగుతోంది!' మనసులో జాలి వరదలా పొంగింది. హృదయం ఆమెపట్ల కరుణతో నిండిపోయింది. 'ఇన్‌స్పెక్షన్ గొడవల్లో, ప్రతి సాయంత్రం రావు కోరికని తిరస్కరించలేక అతనితో తిరిగి తిరిగి పదింటికి కొంప చేరుకోవ

టంలో ఆమె విషయం ఆలోచించుకునే సమయం, ఉత్సాహం లేకపోయింది! తల దగ్గర కూర్చుని ఆప్యాయంగా చెదిరిన ముంగురులు సరిచేస్తూ న్యూస్ పేపర్‌తో మెల్లగా విసరసాగాడు. ఉలిక్కిపడి లేచి కూర్చుంది విజయ అతని చేతిలో పేపరు చూసి బెదిరిపోయింది. మరుక్షణంలో భర్త కాళ్ళని చుట్టేసుకుంది

'నేను సంతకం చేయనండీ! ప్లీజ్! మీరు నన్ను విడిచిపెట్టకండీ. ఇకమీద ఎప్పుడూ మీ మాట కాదనను. మీ యిష్టప్రకారమే నడుచుకుంటాను.' దీనంగా అంటూ విలపిస్తున్న ఆమెని చూసి పరిస్థితి అర్థంకాక నిర్ఘాంతపోయాడు. వెంటనే భార్యని లేవనెత్తి ఒడిలోకి లాక్కుంటూ ఆప్యాయంగా, కంగారుగా అడిగాడు. 'ఏమిటి విజ్జీ! కల ఏమయినా వచ్చిందా?'

మూర్తి మాటలకి తెల్లబోయి చట్టుక్కున లేచింది విజయ. పక్కని పడిఉన్న న్యూస్‌పేపర్ చూసి తేలిగ్గా గాలి పీల్చుకుంటూ 'అవునండీ! ఏదో పీడకల వచ్చింది' అనేసి తప్పించుకుంది.

'అవును మరి ఒక్కదానివే ఇలా పడుకుంటే అలాగే వస్తాయి. పద మంచం మీద పడుకుందువు గాని.'

మెల్లగా మంచం దగ్గరికి నడిపించాడు ఇద్దరూ అసలేమీ జరగనట్టు మామూలుగా అయిపోయారు. 'రేపట్నించి పెందరాళే రండి. ఇంత పొద్దుపోయేవరకు ఈ గదిలో ఒక్కదానికే భయంగా ఉంటుంది. అత్తయ్య ఏడింటికే మంచి నిద్రలో మునిగిపోతుంది' అంది గోముగా.

'యువరానర్ దేవీ! ఆఫీసు ఇన్స్పెక్షన్ గొడవ, ప్లీడరు మిత్రుడి రాక, బాతాఖానీలతో ఆలస్యమవుతోంది ఏదో కేసు గురించి వినాలని ఈ ఊరు వచ్చాడు. ఈ రోజు ఫైనల్ జడ్జిమెంటు జరుగుతోంది. మువ్వా రావాల్సిందేనని [illegible]వంతం చేసాడు. రేపు అతను వెళ్ళిపోతాడులే. అబ్బాయిగారింక అయిదున్నర కొట్టేసరికి అమ్మాయిగారి సన్నిధిలో వాలతారు సరేనా?'

భర్త మాటలతో ఏమూలో కలుక్కుమంటున్న అనుమానం, ఆందోళన ఎండ వేడి తగిలిన మంచులా విడిపోయింది... హాయిగా నిట్టూరుస్తూ 'ఇంతకీ ఏమిటా ఇంటరెస్టింగ్ కేసు' అంది.

'విడాకుల కేసుమాత్రం కాదులే!' ఆమె పలవరింతకు కారణం ఊహిస్తూ అన్నాడు మూర్తి.

వంద నయాపైసల ఆంధ్రపడుచులా చీరకొంగు చివరని వేలికి చుట్టుకుంటూ సిగ్గుపడింది విజయ అది చూస్తూ అతనితోపాటు ముచ్చటపడ్డాడు నెలరేడు.




### జరిగిన కథ

మాధవరావు ఆ వూళ్ళోకి స్కూలుమాస్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యపోతే అతను కుక్కకాటుకు గురి అయ్యాడు. బామ్మగారు అతన్ని యింటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆమె తండ్రి అభిప్రాయం ప్రకారం అతను ఆ యింట్లోనే వుండిపోవలసి వచ్చింది. ఆ రోజున తూలుతూ వచ్చాడు మాధవరావు. అతనుకూడా తన తండ్రిలాగా తాగుబోతు అయినందుకు విచారించింది అనురాధ. అతనికి హితబోధ చేసింది. మాధవరావు తప్పు తెలుసుకున్నాడు.

## 4

ఒక్కో సంఘటన అనుకోకుండా జరుగుతుంది. దాని ఫలితాలు ఈవిధంగా ఉంటాయని అప్పుడు చెప్పలేము. కాని, వాటి ఫలితాలు గమనిస్తున్నప్పుడు ఆ సంఘటన పరిమాణమెంతో అర్థమవుతుంది—ప్రాముఖ్యత స్పష్టమౌతుంది. అలా జరగకూడదన్న వాళ్ళే జరిగినందుకు ఆనందిస్తారు. ఇటువంటిదే ఆనాడు జరిగింది కూడ.

అతడు మామూలుగా స్కూలుకు వెళ్ళియాడు. మళ్ళీ సాయంత్రం వచ్చాక అతని ప్రవర్తన ఎలా ఉంటుంది? ఎదుట పడి ఏదయినా అడిగితే ఏమని జవాబివ్వాలి? ఇలాంటి సందిగ్ధావస్థలో అతని దగ్గర చదువుకోవటం ఎలా?—ఇలా ప్రశ్నలతో వేగిపోతున్నాను.

ఆదేసమయంలో నాన్నగారు లోపలికి పలకరింపుగా — చిన్నగా — దగ్గారు నావైపు సూటిగా చూడకుండా 'అమ్మడూ! ఈ గదిలో పెట్టెలు అవీ తీయించేయమ్మా! కాళ్ళకడ్డంగాలేవూ! చలిగాలిగా ఉంటోంది—బయటపడుకోకండి. మీ పిన్ని మంచంకూడ పడగ్గదిలో పెట్టించు' అన్నారు ఆయన.

నా చెవుల్ని నేను నమ్మలేకపోయాను. గుడ్లప్పగించి ఆయనవైపు చూసాను ఆ కళ్ళల్లో ఏదో ఆర్ద్రత — కుమార్తె దగ్గర సిగ్గుపడేతండ్రి!

రెండేళ్ళుగా అక్కడ విస్సిసామాన్లు పడివున్నా గుర్తించని వ్యక్తికి ఇప్పుడు కాళ్ళకు అడ్డుగా ఉన్నాయట. వేసవి రాబోతుంటే చలిగాలి తిరిగిందిట!...నాకు నవ్వు వచ్చింది.

ఆ సాయంత్రం ఆయన ఓ గులాబిరంగు వరయూరు చీర తెచ్చారు. నేనది బామ్మకు చూపించాను. నా చిరునవ్వుచూసి క్రొత్త పెళ్ళికొడుకులా సిగ్గుపడ్డారాయన. బామ్మ పండుగనాడు పసికందులా, మురిసిపోయింది. పిన్నికంతా అయోమయంగా ఉంది.

నాకా పారవశ్యంలో కాళ్ళకు రెక్కలు వచ్చాయి. మాయింట అల్లనల్లన అడుగులు వేస్తూంది అదృష్టదేవత

నా చేతులతోనే పిన్నికి తలంటిపోసాను. పట్టులాంటి ఆ జుట్టు ఆరబెట్టి జడ వేసాను. దొడ్లో పువ్వులతో నాకావేళ తృప్తిలేక పోయింది. సీతామణి వాళ్ళింటి నంచి తెల్లగులబీలు, పూజార్లింటినుంచి నందివర్ధనాలు తెప్పించాను. బారెడు జడ పూలు కుట్టటంతో మరింత పొడవైంది.

చీరకట్టుకోమన్నాను.

ప్రతి పనికి తెల్లబోతూ తన కళ్ళతోనే ప్రశ్నలవర్షం కురిపించిందామె. 'చెప్తాగా, ముందు కానియ్యి.' అంటూ నవ్వుకునే దాన్ని. చెప్పుకోలేని ఆమె అమాయిక భావాలకు జాలేసింది.

ఆనాడు పూలన్నీ ఎంతో అందంగా ఆనందంగా కనిపించాయి. ఇంటి చుట్టూ పక్షులు పాటకచ్చేరీ పెట్టాయి. ఆక్షణంలో లోకమంతా పండుగ చేసుకుంటున్నంత ఆహ్లాదంగా మధురంగా ఉంది నాకు.

పిన్ని చీర కట్టుకు వచ్చింది. పచ్చని ఆమె శరీర ఛాయకు ఆ గులాబిరంగు చీర అతికినట్టుగా ఉంది. కన్నుల విందుగా మెరిసింది. ఆమె గులాబి బుగ్గల్లో సిగ్గు దొంతరలు. మెరిసే ఆ కళ్ళల్లో కురిసే రాగధార. నా మనస్సు కంతుపట్టని ఆమె ప్రతి కదలికపొంగిపొరలేపారవశ్యము...మొదటిసారిగా నేనప్పుడే చూసానో, లేక ఆమె వైవాహిక జీవితంలో ఇంతకాలానికి ఈ మార్పే కారణమో...నా కంతుపట్టలేదు

మా మాటలు వినగలిగే శక్తి ఆమెకు లేకపోవచ్చు మా హావభావాలను అర్థం చేసుకునే సూక్ష్మబుద్ధి ఆమెకు దైవం ప్రసాదించాడు. ఆమె పెదవులు కదులుతాయి. కళ్ళు మాట్లాడతాయి. ఆమెలో ప్రతి అణువు స్పందిస్తుంది. యౌవనవతిగా, వివాహితగా ఆమె అందరిలాగునే ప్రవర్తిస్తోంది. ఎటొచ్చీ ఆమె తన భావాల్ని బయటకు చెప్పుకోలేదు.

... గ్రహించే సహృదయం ఉండాలికాని

మూగతనం ఆ ద్వమ్తం దా? మా అదృష్టంకొద్దీ ఆలశ్యమే అయినా మా హృదయకవాటాలు తెరచుకున్నాయి; మా పిన్ని మాలో ఒకటి కాగల్గింది!

బామ్మకు నమస్కరించింది పిన్ని. 'దీర్ఘ సుమంగళీ భవ!'— 'దేవుడు మాటివ్వలేదని బాధపడకు తల్లీ! నీకిచ్చిన మంచి మనసే చాలు—మా యిల్లు వెలిగేందుకు—' బామ్మ ఆనంద భాష్పాలతో ఆమె తల నిమిరుతుంటే అలా అన్నట్లనిపించింది.

నాన్నగారి వైపు చూపి తలదించుకొని ఓ క్షణం తటపటాయించి పిన్ని. మంద గమనంతో ఆయన్ని సమీపించి. కాళ్లపైకి వంగేలోపలే ఆమెను తన చేతులతో చుట్టేసి గుండెల కదుముకున్నదాయన. 'నీకింకెప్పుడు అన్యాయం చేయను శాంతి!' అస్పష్టమే అయినా ఆయన మాటలు పిన్నికి స్పష్టమయే ఉంటాయి. గుండెలలో పొంగిన ఆనందం కన్నులలో తొణికి నా బుగ్గలపైకి వెచ్చగా జారింది.

ఆ రాత్రి భోజనాలయినాక తన మంచం కోసం వెతుక్కుంటున్న పిన్నిని చూసి నాలో నేను ముదిపంగా నవ్వుకున్నాను. ఆమె చెయ్యి పట్టుకొని నాన్నగారి గది లోకి తీసుకువెళ్ళి, 'ఇకనుంచి నీ పడక ఇక్కడే!' అన్నాను. నన్ను విదిలించుకు పారిపోబోయింది. 'నాన్నగార్ని పిలుస్తా'నని బెదిరించాను. ముద్దబంతిలా ముడుచుకు పోయింది.

ఆ రాత్రి నాన్నగారు పడుకోటానికి వెళ్ళేవరకు నాకు ముళ్ళమీదున్నట్లుయింది. నేను భయపడినట్లుగా ఆయన బయటకు వెళ్ళలేదు. తల మునకలవుతున్నాను ఆశ్చర్యంతో — మరోమూల గుండెలు పగిలి పోతున్నాయి ఆనందంతో. అప్పటి అనుభవాన్ని మాటల్లో ఎలా చెప్పాలో నాకు తెలియదు.

మా యింట్లో అమ్మను కోల్పోయాక—అంత కడుపునిండుగా సంతోషించిన రోజు ఇదే! మనస్సులో తృప్తిగా ఉన్నప్పుడు ప్రతిదానికి నవ్వుకుంటాము కాబోలు!

గోడపై దీపం పురుగు బల్లికి అందకుండా ఎగిరెగిరి పడుతుంటే నాకు నవ్వు వచ్చింది. దీపం ముందు రవి కునికిపాట్లు పడుతుంటే రాజా వాడినెత్తిన మొటికాయ వేసినప్పుడూ నవ్వు వచ్చింది. పక్కవీధిలో పరకాళావారమ్మాయి అర్మోణీమీద అపస్వ



రాటు తలి సొనాయనతోగా పలికిస్తున్నప్పుడూ నవ్వు వచ్చింది ... లోకంలో నవ్వుకునేది తప్పు మరేదీ లేదనిపించింది ఆక్షణంలో.

ఆనందం అధికమయినప్పుడు కంటిమీదికి నిద్రరాదని మొదటిసారి నాకు తెలిసి వచ్చింది.

ఆర్మాతి పాలగ్లాసు రాజు చేత పంపించాను. అతని కళ్ళబడలేదు నేను.

* * *

మూడురోజులు ముచ్చటగా గడిచిపోయాయి.

సూర్యచంద్రులు గతి తప్పనట్టు రాజు, రవి అతని వద్దకు చదువుకోటానికి వెడుతూనే ఉన్నారు. నాన్నగారు బయటకు వెళ్ళటం లేదు. తాగుడు మాటే తలపెట్టడం లేదు. అసలు జరిగిందంతా కలా–లేక ఇప్పుడు జరుగుతున్నది కలా అన్న సందేహం కలుగుతోంది,

నా ముఖం వైపు చూసినప్పుడల్లా ఆయన సిగ్గుపడుతున్నట్లు కనపడేవారు.

ఆ సంఘటన జరక్కపోతే నాన్నగారు మారేవారా? లేక ఇదంతా కాకతాళీయమా? లేక ఏదైనా అద్భుతశక్తి ఆయన్ని మార్చేసిందా? ఈ పరిణామానికి అతనెంతవరకు బాధ్యుడు? — నాలో మెదిలిన ప్రశ్నలు జవాబులు రాక కదలకుండా కూర్చున్నాయి.

ఏదిఏమైనా నాన్నగారు పూర్తిగా మారిపోయారు. పిన్ని జీవితంలో వసంతం కురిసింది. మా గుండెల్లో వెన్నెల విరిసింది. మా యింట నవచైతన్యం నర్తించింది.

ఆవేళ స్కూలు నుంచి ఇంటికి వస్తూనే వాకిట్లో కూర్చున్న బామ్మ దగ్గరకి వచ్చాడతను. ఎంబ్రాయిడరీ పని చేస్తున్న నా చేతి వ్రేళ్ళు అలానే ఆగిపోయాయి — కరంటులేని దీపాల్లా. అయస్కాంతం నుంచి తప్పించుకోలేని ఇనుప రజనులా నా ఆలోచనలు, చూపులు అతని చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

అతడేదో పేకెట్ విప్పాడు. చిన్న వస్తువు చింతగింజ సైజులో ఉంది. దాన్నుంచి వైరు వ్రేలాడుతోంది. దన్ని చిన్న బొమ్మ పెట్టెకి తగిలించాడు. బిళ్ళలాంటి దాన్ని బామ్మ చెవిదగ్గరగా పెట్టి, 'బామ్మగారూ! ఇది చెవిలో పెట్టుకోండి.' అని అంటూ ఆమె కందించాడు.

# రాగధార

'ఇప్పుడు వినిపిస్తోందాండీ!' అని అడిగాడతను.

బామ్మ ముఖం పుచ్చపువ్వులా విప్పారింది. నేను వింతగా గుడ్లప్పగించి చూస్తూండి పోయాను.

'ఓయి నీయిల్లు బంగారం కాను! వినిపిస్తోందా అని అడుగుతావేమిటోయ్! అదిగో సినిమా కారు వచ్చినట్టుంది. పాట కూడ వినిపిస్తోంది.'

నాకు ఫక్కున నవ్వు వచ్చింది. ఓ ప్రక్కన గుండెల్లో ఆనందం పొంగిపొరలుతోంది.

అప్పుడే అతను నాకళ్ళల్లోకి చూసాడు. ఆ చూపులు తప్పించుకున్నాను. 'నీమీద చెడు మాటలు చెప్పుకునే వాళ్ళిమాటు దొరికిపోతారు బామ్మా!' అన్నాను ఏదో నవ్వించాలని.

'చెడుమాటలు వినటానికి కాదే తల్లీ అతనంత ప్రేమతో తెచ్చినది. సంగీతం కోసం చెవికోసుకునే ఈ ముసలి బ్రతుక్కో అర్థం చూపటానికి ... మళ్ళీ నీ కంఠం వినే అదృష్టం నాకు దేవుడు కలిగిస్తాడనుకోలేదు. నిన్నోసారి ఆ వీణ ముందు చూసాక నీపాట విన్నాక ఈ ప్రాణాలు గుటుక్కుమన్నా ఫర్వాలేదిక ... దేవుళ్ళా వచ్చాడు మనింటికి...' బామ్మ ప్రశంసా వాక్యాలు ప్రవహిస్తున్నాయి.

అతని నేలచూపులలో నిర్లిప్తత ఉంది. నేనలా అచేతనంగా కూర్చుండిపోయాను. నాకేసి క్రీగంట చూస్తున్నాడని నాకు తెలుసు. కాని, ఆ సన్నివేశాన్ని ఎలా అర్థం చేసుకోవాలో — గత సంఘటనతో యెలా అన్వయించుకోవాలో అర్థంకాక తికమక పడుతున్నాను కనురెప్పలపై ఏదో అధైర్యం బరువు నొత్తిపెట్టింది.

హఠాత్తుగా, 'దీని ఖరీదెంత బాబూ!' అని బామ్మ అడిగింది.

నేను చటుక్కున తలెత్తి చూసాను.

'ఏమో! నాకు తెలియదండి. నీ గురించి మా స్నేహితుడికి వ్రాస్తే పంపాడు మీ కివ్వాలనే తెచ్చాను...'

బామ్మ సందిగ్ధంలో పడింది. 'చూస్తే బోలెడంత ఖరీదుదిలా ఉంది. అబ్బా యేమంటాడో! పోనీ నాడికి చూపించి...'

'...మీరలా అంటే నాకు బాధగా ఉంటుంది. అభిమానంతో తెప్పించాను. తిరస్కరించకండి. నేనే మీ మనుమడినైతే మీరిలా అనుమానించేవారా?...'

బామ్మేకాదు — నేనూ తెల్లబోయాను. ఒక్కక్షణం వివరం మాట్లాడలేక పోయాము. నేను మూగదాన్నయ్యాను.

'మీరు కావల్సినప్పుడల్లా ఇది క్రిందకు నొక్కండి. హాయిగా వినిపిస్తుంది.'

ఇంతలో నాన్నగారు వచ్చారు బామ్మ చెవిలోంచి వ్రేలాడుతున్న సరంజామా అంతా చూసి తెల్లబోయారు. బామ్మ విషయం చెప్పింది.

నాన్నగారినే గమనిస్తున్నాను నేను. ఆయన ముఖం జేవురించింది. '...దాని ఖరీదు మీకు తెలియదని చెప్పినా నాకు తెలుసు మాస్టారూ!...'

క్షణంపాటు చలించాడు అతను 'క్షమించండి. నిజంగా నాకు తెలియదు. వేణుగోపాల్ అనే డాక్టరు నాకు ప్రాణ స్నేహితుడు అతనికి విషయం వ్రాసాను. తర్వాత వీలునుబట్టి అక్కడకు తీసుకువస్తే పరీక్ష చేస్తానని, ప్రస్తుతానికి 'హియరింగ్ ఎయిడ్' ఉపయోగించమని పంపాడు అంతకుమించి మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలనే దురుద్దేశ్యంతో నేనీ పని చెయ్యలేదు మీరు నమ్మినా నమ్మకపోయినా అది నిజం! విశ్వాసాన్ని మించిన ఆత్మీయత మరేదీ లేదని మీకు తెలుసుగా డాక్టరుగారూ!...' అతని కంఠం గద్గదికమవటం నన్ను చకితురాల్ని చేసింది. ఆ వెంటనే అతను తన గదిలోకి వెళ్ళిపోయాడు.

'నేను తొందరపడ్డాను...' అని తనకు తను చెప్పుకున్నట్టుగా అన్నారు నాన్నగారు. ఆయన ముఖకవళికలు పరిశీలిస్తూ ఊపిరి బిగపట్టాను నేను.

'...అయితే ఇప్పుడు నీకు బాగుందామ్మా!' అని నవ్వుతూ బామ్మని పలకరించారు ఆయన. అప్పటికి బామ్మ, నేను తేరుకున్నాము.

'అతని కడుపు చల్లగ ... ఇన్నాళ్ళకి మళ్ళీ నాకు చెవులొచ్చాయిరా అబ్బాయ్!' — నాన్నగారి చిర్నవ్వులో తృప్తి ఉంది.

# గ్లాక్సోస్-డి వేసవి అలసటను తక్షణం పోగొట్టగలదు !



## గ్లాక్సోస్-డి ఎన్నో రుచికర మార్గాలలో తీసుకోండి!

రోజులు వేడెక్కిన కొద్దీ, మీరు తేలికగా అలిసి పోగలరు. మీ శక్తి అంతా ఏమైందా అని ఆశ్చర్యం మీకు కలుగుతుంది. చల్లపరచు గ్లాక్సోస్-డి తెచ్చుకోండి. ఒక గ్లాసు నీళ్లలో రెండు చెంచాలను కలపండి.

మీరు త్రాగేటప్పుడు, ఉప్పొంగే శక్తిని పొందండి.

ఎందువలనంటే గ్లాక్సోస్-డి మిమ్మల్ని కార్యాచరణకు శక్తి గూర్చగలదు—తక్షణమే.

అదొక మహత్తరానుభూతి.



నీళ్లతో



యథా తథంగా



నిమ్మ పానీయంతో



టీ లేక కాఫీతో

## ఉచితం!

## 3 గ్లాసుల సెట్

రూ. 1.25 విలువగలది,
ప్రతి 700 గ్రా.ల
గ్లాక్సోస్-డి®
టిన్‌తో, పొందండి.

త్వరపడండి!
సరుకు ఉన్నంత వరకే
ఈ సదుపాయం!






## గ్లాక్సోస్-డి®
## తక్షణ శక్తి కోసం

dCP/GL/27 tel

నాలో ఆత్మవిమర్శ మొదలయింది.

ఇంత సాత్వికుడు, సహృదయుడు ఆవేళ విందుకావని చేసాడు? ఆ తర్వాతనే మా యింట ఊహించని మార్పులెలా వచ్చాయి? వెన్నెల వెలుగులో నల్లనిసీడలా అతని దుష్ప్రవర్తన అలా కనిపించి ఇలా పోయింది. ఆ వెన్నెల శాశ్వతమా? ఈ నీడ అబద్ధమా? ఇదంతా నేను చూసే దృక్పథంలో ఉందా! లేక అతని ప్రవర్తనలో? ఆ సంఘటన తప్ప మరేమార్పూ లేదా? అయితే, ఏ కారణబలంతో అతడా నాడు చపలుడయ్యాడు? ఇప్పుడు తన నిజ రూపం చూపించాలని తాపత్రయ పడుతున్నాడా? అన్నీ అందని కొమ్మమీద ఊగిసలాడే కాయల్లా జవాబురాని ప్రశ్నలు.

ఎన్ని విధాల సరిపెట్టుకుందామన్నా చిక్కుముడి విడటంలేదు. నేను సమర్థించుకోలేకుండా ఉన్నాను. అతన్ని ఇంత మంది అర్థంచేసుకున్నట్లుగా మసలుతున్నారు...కాని, అందరికంటె పరిచయమున్న నేను అతనికి దగ్గర కాలేక పోతున్నాను. అంతా అయోమయంగా ఉంది. అందులో బామ్మ మాటిమాటికి అతన్ని పొగడ్తలతో ముంచెత్తుతోంది— అది మరింత నన్ను కంగారు పెడుతోంది.

నాలో సహించలేని సంఘర్షణ. భరించలేని బాధ. శాంతిలేని హృదయం ఈదురు గాలికి చిగురుటాకులా రెపరెప లాడిపోయింది.

ఒకరికొక నిర్ణయానికి వచ్చాను. అతని విరుటు పడాలి...బిడియం విడిచి అడిగేవన్నీ అడగాలి. అంతవరకు ఈ సమస్య సమస్యగానే ఉండిపోతుంది— అనిపించింది.

ఈ నాల్గురోజులనుంచి అతన్నుంచి తప్పించుకు తిరుగుతున్నాను. రాజా పాలు తీసుకువెళ్ళి ఇస్తుండేవాడు.

ఎప్పటిలా వాడు వచ్చి అడిగితే, 'నేనిస్తాలే—నువ్వెళ్ళి చదువుకో—' అన్నాను. వాడు తెల్లమొహం వేసాడు. నేనది గమనించనట్లు తల త్రిప్పుకున్నాను.

ఆరాత్రి అందరి భోజనాలు అయినాక పాలగ్లాసు తీసుకొని అతని గదిని సమీపించాను. నా అడుగుల చప్పుడు నాకే వినిపించే నిశ్శబ్దంలో అతడు పుస్తకంలోంచి తలయెత్తి చూసాడు. నడిలేని ఆ చిరునవ్వు గుండెల్లో విడిది చేసుకుంది. అది విజయ హాసమో, మధురహాసమో మరి! నా తల

# రాగధార

బరువుగా క్రిందికి వంగిపోయింది.

'...పాలు...'

'లోపలికి రా రాధా!' అతని పిలుపులో ఎప్పటి సౌజన్యం ఉంది.

మరబొమ్మలా చేతిని కదలించాను. బల్లమీదకి పాలగ్లాసు చిరుశబ్దం చేస్తూ దిగింది.

'నా పై కోపం పోయిందా రాధా!'

ఉలిక్కిపడ్డాను. చివ్వున ఎవరో తన వైపు లాక్కున్నంత కంగారు నాలో—పెదవులు తడబడ్డాయి. 'మీపై నాకు కోపమెందుకు?'

'విజ్ఞాని, వివేకి, ఆత్మీయుడు ... అనుకున్న ఈ మాస్టారి వింత ప్రవర్తనకి. ఓ క్షణం ఆగి వస్తాడు. మరోక్షణం

## వాసంతహేల

మధుమాస మరుదెంచె
హృదయ భావ ముదయించె
నవరాగ రేఖ లవె!
నవకెల్లి హసియించె||

చిగురాకు కెంపులు
వెలుగారె నవకళలు
చిరుగాలి కెరటాలు
పరతెంచె నలుదెసల||

వగరు చిగురుల మేసి
పికము పాడెను గీతి
తొగరు మధువుల గ్రోలి
ఎగిరి యాడెను తేటి||

ఎలమావి తరుశాఖ
తలిరాకు గుబురులో
శుక శారికా తతుల
సుఖియించగా చేరె||

మల్లియలు విరబూసి
మనసులను రంజించె
వెన్నెలలు విరజాజి
కన్నులను మురిపించె||

మధు మాస హాసమ్ము
మహోత్సవ్య సంపదమ్ము
మనకబ్రాప్త కుసుమమ్ము
మనిషికన్న గంధమ్ము||

—సురధి నరసింహము

పద్మాసనం వేసి ప్రార్థన చేస్తాడు. నేడు మంచికి మరునాడు చెడుకి తయారవుతాడు. ఇటువంటి వ్యక్తిని నమ్మాలో, పొమ్మనాలో నిర్ణయించుకోలేని స్థితికి తీసుకువచ్చాను కదా మరి!...' అతని పెదవులపై మందహాసం మాయలేదు.

నాలో నేను మరింత ఆశ్చర్యంతో చలించి పోయాను. నా మనోభావాలతను చదవ గలిగినందుకు సిగ్గుతో ముడుచుకుపోయాను.

'నీ కభ్యంతరం లేకపోతే ఓ క్షణం అలా కూర్చో రాధా! జరిగిందేమిటో చెప్తాను' మంత్రగాని ముందు నాగుపాములా తల వొంచాను.

'నీలో మోతాదుకుమించి అనృతం చిలికిన దేవుడు కావల్సినంత మనస్థైర్యం ఇవ్వాను కాదు. నీ ఊహాలోకం స్వర్గ ధామం. మానవులంతా దేవతలు. నీలాకాశంలా నిర్మల హృదయులు. పూవుల్లా సరసస్వభావులు ... కాని, వాస్తవికతలో నీ ఊహాలు తారుమారవుతాయి. ఫలించని ఆశలు నిన్ను కృంగదీస్తాయి. అందుకనే మంచీ చెడుల పోలిక అర్థంకాని వైవిధ్యంలో మనోవేదనకు గురవుతావు. ప్రతి చిన్న విషయాన్ని తర్జనభర్జన చేసి గత అభిప్రాయాలతో సమన్వయించు కుంటావు. అప్పుడే నీ మనస్సు కలగిపోతుంది... ఇప్పటికెన్నిసార్లు నన్నసహ్యించుకున్నావో, ఎన్నిసార్లు అందలమెక్కించావో నీకయితే గుర్తు రాలేదేమో కాని నాకు బాగా తెలుసు.'

ఓసారి అతని కళ్ళల్లోకి చూసి అపరాధినిలా తల దించుకున్నాను.

'వయస్సుకు మించిన భావచైతన్యం, ఆత్మవిశ్వాసం నేను వచ్చిన క్రొత్తలోనే నీలో గుర్తించాను. స్త్రీలకు సాధ్యమైనంతవరకు దూరంగా ఉండే నేను విచిత్రపరిస్థితుల్లో మీ యింట అడుగు పెట్టాను. ఇక్కడ సమస్యల చిక్కుల్లో ముడిపడిన నిన్ను చూసాను. నీ గాథ విని సత్సంకల్పంతో ఈ అనుబంధం కల్పించుకున్నాను. నీమక్కి కూడా బోసి తలపెట్టాని అమృత 'హృదయులు శాపగస్తు లెందుకయ్యారు? ఆవేదనలో మునిగి జీవితాన్ని అర్థంపాతం చేసుకుంటున్న మీకు నేనేవిధంగా సహాయం చేయగలను? ఇదే నా ఆలోచన...'

ఒకక్షణం నిశ్శబ్దం! అతని కంఠంలో సెలయేరు — గలగల పారుతోంది.

గుండెల్లో పేరుకున్న వ్యథను మోసుకు పోతోంది—దూరంగా, సుదూరంగా.

'...మీ నాన్నగారు డాక్టరుగా ఈ చుట్టు పట్ల ఎంత పేరు తెచ్చుకున్నారో విన్నాను. గొప్ప వ్యక్తిత్వం కలిగివుండి మనోదౌర్బ ల్యంతో నైతికంగా దిగజారిపోవటం చూస్తూ ఎలా ఊరుకోను? ఊరు అంటు కుంటే మనింటిదాకా రాలేదు కదా అనే ఈ వూరి సంకుచిత మనస్తత్వాల నర్థం చేసుకున్నాను. ఆయన వయస్సులో, అను భవంలో నాకంటె పెద్దవారు. నేరుగా ఈ పని తప్పు అని చెప్పటం సబబు కాదు —ఇక మీ నాన్నగారికి నీవంటే ప్రాణం. అది మొదటి క్షణంలోనే గ్రహించాను. నీ గురించి ఆయన ఏ త్యాగం చేయటానికీ వెనుదీయరు. అంటే నీకు కష్టం కలగాలి. ఆ కష్టం తనవల్లనేనని ఆయనకు తెలి యాలి. చెప్పకనే చెప్పినట్లుయి ఆయనచేత ఆలోచింపజేయాలి. అందుకనే జీవితంలో ఎప్పుడూ చేయని ఈ పాడు పని చేసాను. తనకంటె చిన్నవాడు, చదువుకున్నవాడు తన కళ్ళెదుటే తాగుబోతు అవటం ఏ సహృదయుడూ సహించలేడు. ఇక మీ నాన్న గారి మాట వేరే చెప్పాలా? నన్నడగటానికి ముందు తానెందుకా పని చేస్తున్నట్లు— అన్న ప్రశ్న ఎదురౌతుంది. ఆయన అంత ర్యం ముందు ఆయనే దోషిగా నిలబడే పరిస్థితి అది!—'

అలా స్థాణువులా నిలబడిన నేను ఉద్వే గంతో వణికిపోతున్నాను.

'...నాకు తాగుడంటే పరమ అసహ్యం. అయినా ఈసారి భరించవల్సి వచ్చింది. దైవానుగ్రహంవల్ల నా పథకం పారింది. నీ మాటలన్నీ వింటూనే ఉన్నాను. కాలేజీ నాటి నాటకానుభవం రక్తి కట్టించింది. నా పాత్రను నేను నిగ్రహంతో పోషించాను. ఆ మరునాడు నన్ను నీవు నిలవేస్తావని నాకు తెలుసు. జవాబుతో సిద్ధంగానే ఉన్నాను. అంతా అనుకున్నట్లే జరిగింది... నువ్వు వచ్చాక మాటకి పోటీ మాటలు నీచేత పలికించింది నిన్ను కష్టపెట్టాలని కాదు రాధా!... ఆ ఆవేశంలో నీకు తెలియ లేదు కాని మీ నాన్నగారు డిస్పెన్సరీ గది లోంచి మన మాటలు వినటం నేను క్రీగంట గమనిస్తూనే ఉన్నాను..'

ఎంత మూర్ఖురాల్ని? '...మాస్టారూ! నన్ను క్షమించరూ!' పొరలివచ్చే దుఃఖంతో అతని పాదాలవద్ద కుప్పగా కూలిపోయాను,

అతని చేతులు నన్ను పొదివి పట్టు కున్నాయి. పాతాళంలోకి కుంగిపోతున్న నన్ను ఓ దివ్య హస్తం చేయూతనిచ్చిన అనుభూతి నిలువెల్లా స్పందించింది.

'నువ్వు పిచ్చిదానివి...'

'మిమ్మల్నెంతగా అవమానించానో తలుచు కుంటే ..'

'అది అవమానం కాదు. అభిమానం లేకపోతే, నేను తాగితే నువ్వెందుకు బాధ పడతావు? నా గురించి ఎందుకు పట్టించు కుంటావు? అభిమానించే వాళ్ళకే కోప్పడే హక్కు ఉంటుంది. ప్రేమించే వాళ్ళే శిక్షించగలరు కూడా!...'

అంతవరకు సిగ్గుతో ముడుచుకుపోయిన నాకు ఒంటిమీద స్పృహ కల్గింది. మృదు వుగా అతని చేతులు విడిపించుకొని కళ్ళు తుడుచుకున్నాను.

'...అంతా పీడకలలా జరిగింది...'

'అవును ..అదంతా ఒకమంచికి జరిగింది. దాని గుర్తులంత బాధపెట్టేవి కావు. అయినా, ఆనేళ నువ్వట్లా నిలదీయకపోతే నేనవల్సినవి నాలుగూ అనగలిగే వాడిని కాదు. నా ప్రయోగం ఫలించేదికాదు—'

తేలిపోతున్న హృదయంతో నవ్వాను.

'ఇంతలోనే నవ్వుతావు. అంతలోనే కన్నీళ్ళు పెడతావు. ఆ మాత్రం మన స్థైర్యం లేకపోతే ఎలా?...'

'...అవును. నాకు తెల్సింది చాలతక్కువ. నే నింకా ఎన్నో నేర్చుకోవాలి.'

'అమ్మగారు చెప్తున్నారే నువ్వు వీణా పాణివని...'

నేను మాట్లాడలేదు. జ్ఞాపకాల తెరల మాటున విషాదగాథ నిండిపోయింది. కదిపితే కందిరీగల తుట్టె అది!

'నీ బాధ నాకు తెల్సురాధా! బాధలనుంచి, దుఃఖంనుంచి ఎంత పారిపోదామని మనం ప్రయత్నిస్తామో అంత వెన్నాడుతుం టాయి బాధలు. వాటిని జయించాలంటే మనస్సును మైమరపించాలి. అందుకు నీ చేతిలో చక్కని విద్య ఉంది. నీగొంతులో సంగతులు పలుకుతాయి. సంగీతమే జీవి తంలో ఒక భాగమయితే అంతకుమించిన అదృష్టం మరొకటుండదు. కళాతపస్విని అయిన తల్లి ఉగ్గుపాలలో ఆశక్తిని బిడ్డకు రంగరించి పోస్తుంది. ఆ బిడ్డ ఆ విద్యనే చిన్నచూపు చూస్తే...'

'...లేదు మాస్టారూ! నేనలా ఎప్పుడూ అనుకోలేదు వీణంటే నాకు ప్రాణం. కాని, అమ్మపోయాక నాగొంతు అపశ్రుతులు పలుకుతోంది. ఇంకేం చేయను?...

'మొదట్లో ఆ బాధకు తట్టుకోవటం కష్టం. కాని, పాడనవల్ల గతాన్ని మర్చి పోగల మనోబలం కలుగుతుంది. అమ్మ ఆశీర్వాదంతో జీవనరాగంలో వీణాగానం పడుగుపేకలా కలిసిపోతుంది...ప్రయత్నించి చూడు—నీకే తెలుస్తుంది. సృష్టిలో పక్షులెన్ని ఉంటేనేం అన్నీ కోయిలకు సమానం కాగలవా?'

సామాన్యుడనుకున్న వ్యక్తి కోటగోడంత ఎత్తు ఎదిగిపోయాడు. మామూలు మాట లనుకున్నవి ముత్యాల సరాలయిపోయాయి. తోటిమనిషికి మనిషిగా ఎంత సహాయం చేయవచ్చో అతను ఆచరించి అర్థం చెప్తు తున్నాడు. గుండెల్లో గులాబీలు పూయించు



# భస్మధారణం — ధర్మపథం



— బులుసు వేంకటరమణయ్య

వైదిక మతాన్ని అనుసరించినవారు త్రిపుండ్రధారణం చెయ్యడం అనాదినుంచీ వస్తూ ఉన్న ఆచారం! అద్వైతులూ, శైవులూ ధరించే తిర్యక్ పుండ్రాలకూ, శరీరానికి పూసికొనుటకూ భస్మాన్ని ఉపయోగిస్తారు.

'భస్మ' అనే నామం దానికి రావడానికి తగిన కారణం ఉన్నది. భ — అనేది భర్జనానికి ఉపలక్షకం. అంటే పాపాలను మంగలంలో ధాన్యాదులు వేచినట్లు వేచి నశింపచెయ్యడం. స్మ — స్మరణాన్ని తెలుపుతుంది. అంటే శివనామస్మరణ ఫలాన్ని కలిగిస్తుంది. అందువల్ల భస్మధారణ వల్ల పాపాలు నశిస్తాయనీ, శివనామాన్ని స్మరించకపోయినా శివనామస్మరణ వల్ల కలిగే ఫలం లభిస్తుందని తెలుసుకోవాలి. ఈ విషయాన్నే ఈ శ్లోకం తెలియజేస్తూ ఉన్నది —

'భర్జనాత్సర్వ పాపానాం
స్మరణాచ్చ మహేశితుః
భస్మేతి చ సమాఖ్యాతం
తస్య ధారణ ముత్తమమ్.'

సమస్త పాపాలనూ వేచి మాడ్చివేయడం వల్లనూ, మహేశ్వరుని స్మరణవల్ల కలిగే ఫలాన్ని ఇవ్వడంవల్లనూ భస్మానికి ఆ పేరు వచ్చినదనీ, దాన్ని ధరించడం ఉత్తమమనీ దీని అభిప్రాయం.

ఆచార పరాయణులైన అద్వైతులు, శైవులూ — తమకు అనారోగ్యంగా వుండి స్నానం చెయ్యడం సాధ్యం కానప్పుడు భస్మస్నానం చేస్తారు అంటే శరీరం నిండా భస్మం అలదుకొంటారు. భస్మస్నానం చేస్తే గంగాది తీర్థాల్లో స్నానం చేసినట్లవుతుందని వారి నమ్మకం. కేవలం లలాటంపైని భస్మంతో త్రిపుండ్రాలు ధరించినంత మాత్రాన సర్వతీర్థ స్నాన ఫలం లభిస్తుందని శివపురాణంలో ఇలా ఉన్నది —

'యాని తీర్థాని లోకేఽస్మిన్
గంగాద్యాః సరితశ్చయాః,
స్నాతో భవతి సర్వత్ర
లలాటే తు త్రిపుండ్రకమ్'

లోకంలో పుణ్యతీర్థాలు ఎన్ని ఉన్నవో, గంగానది మొదలైన నదులు ఎన్ని ఉన్నాయో వాటి అన్నిట్లోనూ స్నానం చేసిన ఫలం, లలాటమందు త్రిపుండ్రాన్ని ధరించినంత మాత్రాన లభిస్తుంది — అని దీని అభిప్రాయం.

బైరాగులూ, సన్యాసులూ దేహంపై మరే వస్త్రం లేకుండా కౌపీనం మాత్రం ధరించి శరీరానికి విభూతి పూసుకుంటున్నారు. తీవ్రమైన చలిలో కూడా చలించరు భస్మం వేడిమిని కలిగిస్తుందనీ, దాన్ని శరీరానికి పూసుకుంటే వస్త్రం కప్పుకున్నట్లు ఉంటుందనీ అనుభవజ్ఞులైన సన్యాసులవల్ల తెలుస్తున్నది.

## రాగధార

కొని కన్నుల్లో తేనెలూరింప చేయగలశక్తి ప్రేమకు ఉందని అతడనుభవించి చెప్తున్నాడు — అర్థం చేసుకోమంటున్నాడు — ఆనందించమంటున్నాడు.

'భగవాన్! ఈ మహోన్నతమైన వ్యక్తిని మళ్లీ దూరంచేసుకునే దుర్బుద్ధిని నాలో రానీకు. అంతెత్తుకు[illegible] నన్ను ఆపాదాల దగ్గరగా రానివ్వు. నాకింకేమీ అక్కరలేదు. అతని సమక్షం చాలు' నా హృదయం నిరంజనుడైన పరమాత్మకు నివాళి ఇచ్చింది... నిశ్చలమైన నివేదన చేసుకుంది

పాలనురుగువంటి ఆ దరహాసం నాకోసమే నన్నట్లుంది. మెరిసే ఆకంటిచూపులు నా ఒళ్ళంతా మెత్తగా మత్తుగా స్పృశిస్తున్నాయి. ఆ అనుభూతిలో ఏదో బుజ్జగింపు — ఏదో అనురాగం.

ఆ క్షణంలో ఒక్కపరుగున వెళ్ళి అతని ఒడిలో వాలిపోయి బరువుతీరేలా ఏడుద్దామనిపించింది ... నేనెంతో పసిదాన్నయిపోయాను. అతనిలో అమ్మని, నాన్నని, స్నేహితుడని,... ఆఖరికి దేవుడిని చూడగలిగాను.

'...నేనింకేమీ చేయలేను. నాకింకేమీ వద్దు. మీరే నాకు స్వర్గం. మీ సమక్షంలో ఇలా ఎల్లకాలం గడపగలను ఈ సుఖనిద్రలో నాకీ జగత్తంతా శూన్యంలా... సర్వసం మీరే, మీరే సర్వస్వంగా కనిపిస్తోంది. నేనీ ఉద్వేగానికి తట్టుకోలేకపోతున్నాను. నాకు ఆసరా కావాలి. నేనిక నిలువలేను. నాకు స్పృహతప్పి పోతోంది. రండి. నన్నాదుకోండి...' నా మనస్సేదేదో చెపుతోంది. నా కాళ్ళు తేలిపోతున్నాయి. గొంతు పెగలటం లేదు. నాకు బాహ్యస్మృతి తప్పిపోతోంది.

అతడు నా భుజాలు పట్టుకొని మంచం దగ్గరకి తీసుకువెళ్లాడు 'కాస్సేపు అలా పడుకో! అంతా సర్దుకుంటుంది' అన్నాడు.

అతడే నన్ను పొదివి పట్టుకొని మంచంపై వెక్కి పడుకోపెట్టాడు. నా శరీరమంతా ఏదో విద్యుత్తు ప్రవహిస్తున్నట్లు ఝల్లుమంది కళ్లు మూతలు పడిపోయాయి. అది నిద్రకాదు. స్పృహ తప్పిపోవటం కాదు. తన్మయత్వం... హాయి అనిపించే అనుభూతి అలా ఎంతసేపుండిపోయినో నాకు తెలియదు.

(ఇంకా ఉంది)

# చిన్నసైజు హిట్లర్లు!

కె. రామలక్ష్మి



సంసారం కొత్త. పిల్లలు కొత్త. ఇల్లు కొత్త. అలాంటి సమయంలో పని తెమలక పిల్లల్ని చూసుకుంటుంది కదా అని— ఓ ముసలి ఆయాని పెట్టుకున్నాను. నిజమే. చాలా బాధ్యత కలిగే పని చేసేది. అప్పటికి నాకా, అమ్మమ్మల్ని అమ్మల్ని పింతల్లు లని మేనత్తలనే చూసిన నాకు యీ ఆయా కొత్త అనుభవమే. పనిమనిషి వేరు. కాని పిల్లల్ని చూసుకునే ఆయాలకున్న అధారిటీ వేరు. వారి తత్వం వేరు... కొత్తలో ఆయాని చూస్తే 'బేరు'మన్నా కొంచెం పెరగను పెరగను ఎలా తినాలో, ఎలా స్నానం చెయ్యాలో, ఎలా బట్టలు కట్టుకోవాలో—నేర్పే ఆయాని భరించడం నేర్చుకున్నారు పిల్లలు. కాని నేనే ఏం నేర్చుకోలేకపోయాను. బాధపడిపోయాను. యింట్లో పులినో దెయ్యాన్నో తెచ్చి కట్టేసినంత పిరికితనం ఆవహించింది నన్ను; ఆ ఆయా దృష్టిలో నాకు ఏం తెలియదు—పిల్లల్ని పెంచడం నీకేం తెలుసు నీముఖం అన్నట్టు చూసేది. అంతేకాదు. ఎప్పుడేనా పాప నెత్తుకు తిరుగుతానంటే ఏం చేయలేక సహించి ఊరుకునేది! 'లేదు జీతం పుచ్చుకున్నావు కదా అని నీ ఉనికి భరిస్తోంది' అనేవారు మా ఆయన. చివరికోరోజున 'నీకు నేను తగిన యజమానిని కాదని' నూనిపించుకోవలసి వచ్చింది — ఆ అధారిటీ భరించలేక. ఇలాంటి అత్తగార్లుకూడా ఉంటూంటారు వయస్సు తక్కువ కనుక తీసిపారేస్తారు.

జీవితంలో ఇలా తోసిరాజనేవారే ఎక్కువగా కనిపిస్తూంటారు. బస్సు స్టాండులో, సినిమాల క్యూలలో — పడి గాపులు పడేలా నిలబడివుంటాం — అలా నిలపెట్టే పెద్ద మనిషిని ఎప్పుడేనా పరిశీలనగా చూశారా? వెన్న నాకిన పిల్లిలాగా తృప్తిగా అటూ యిటూ తిరుగుతూ ఉంటాడు—ఇంత మందిని ఒక్కమాటతో నిలబెట్టాం కదా అని ఆ తృప్తి. కొందరు బస్సు డ్రయివర్లుంటారు — ఏదో కారు రేసులో వెడుతున్నట్టు! దారిలో ఆపితే క్షణం దండుగ అయిపోతుందని ఆపమని గగ్గోలు పెట్టినా వినిపించుకోరు. మన పోరుకి కండక్టరుకికూడా నవ్వొస్తుంది. ఇక స్టాండులో బస్సు ఎక్కవలసివస్తే — ఒకటికి రెండు బస్సులుంటే—కండక్టర్లూ డ్రయివర్లూ ఆడుకునే ఆట బాగుంటుంది—వాళ్ళలో ఏ ఒక్కరికి తెలియదు 'ఏ బస్సు ముందు వెడుతుందో!' తీరా ఒక బస్సులో ఎక్కి కూర్చున్నాక పక్కనించి వెనకబస్సు ఖాళీగా దూసుకుపోతుంది! ఆ వేళే ముందు డ్రయివరూ కండక్టరూ ఏం కుషీగా ఉంటారని! ఏదో ఒక యూనిఫారమ్ ఉంటే అధారిటీ పెరుగుతుంది కబోలు! అది లేని సామాన్యులు దాసానుదాసులుగా కన్పిస్తారు కాబోలు. అధారిటీలోకి రాగానే ఇలాంటి మార్పు వస్తుందో వీళ్ళలో—లేక ఇలాంటి తత్వంవుండే — అటువంటి ఉద్యోగాలు చేపడతారో — మరి తెలియదు చిన్న మెత్తు అధికారం — యింత నిర్లక్ష్యం సంపాదిస్తే — పూర్తి అధికారం వారి నింకెలా మారుస్తుంది?! ఇంటిదగ్గరకూడా వీళ్ళిలాగే ప్రవర్తిస్తారేమో చూడాలనిపిస్తూ ఉంటుంది నాకు.

ఇలాంటి పబ్లిక్ సర్వీసులలోనే కాదు. బజారులో కొట్లలోకూడా వుంటారిలాంటి చిన్న సైజు హిట్లర్లు. కావలసినా అక్కర్లేక పోయినా — ఏదో ఒకటి కొనిపించి మరీ వదులుతారు! యిక చైనాబజారులో రోడ్డు వీరాక నడవనీయరు— 'రండమ్మ ఏం కావాలి?' అంటూ. చిన్న చిన్న రిపేర్లకి సహితం హడలుకొట్టే మొత్తాలుచ్చుకొనే నిపుణులూ, భయపెట్టి ఎక్కువ డబ్బు గుంజే పనివాళ్ళూ — వీళ్ళంతా — ఎందుకు వుంటారో అర్థమైతే బాగుండును.

వీరినసలు పట్టించుకోకుండా ఉండ కల్గితే బాగుండును. కాని కుదరదే. మన యీ అసహాయత వారికీ తెలుసు. వారికున్న అధారిటీ మనకి తెలియచేసి తీరతారందుకే.

ఒక్కొక్కప్పుడు ఇలాంటి వారినిచూస్తే జాలేస్తుంది. నిజజీవితాల్లో ఏదో వెలితి యిలా వారిని ప్రపంచంమీద కక్షకట్టినట్టు ప్రవర్తించేలా చేస్తుందనిపిస్తుంది కాని ఏంలాభం ఓ రోజు బస్సులో వెళ్ళివస్తే—నా మూడ్ వారం రోజులు పాడవుతుంది—దాంతో అప్పుడే—నేనూ ఎవరివీరాదేనా అననడం ప్రారంభిస్తాను!!



**ఒక వ్యక్తి మీద వివిధమైన అభిప్రాయాలున్నట్లే ఒక సంస్థ మీద కూడా వుంటాయ్.**

**పెద్ద ఆసుపత్రి మీద ఒక వాదు "నరకం యెక్కడో లేదు, భూమ్మీద నరకం పెద్దాసుపత్రి" అని. ఇంకో అభిప్రాయం – "పోతున్న ప్రాణాన్ని పట్టి వెనక్కి లాగుతారు.**

**"ఇక్కడ చచ్చినవాళ్ళకి ప్రాణంపొయ్యలేరుకానీ–మనుషుల బాధలను బాగుచేసే దేవతలు ఆ డాక్టర్లు. ఆసుపత్రి ఒక భూతలస్వర్గం."**

సూర్యంకు ఇదివరకే ఆసుపత్రి మీద ఒక అభిప్రాయం యేర్పడింది. అది సరకంగా యీనాటికీ వుండిపోయింది. ఆ అభిప్రాయంతోనే తను మళ్ళీ ఆ ఆవరణలో అడుగు పెట్టవలసి వచ్చింది.

ఈసారి ఒకరిని చూడటానికి కాదు. తనే చికిత్సపొందటానికి ఆసుపత్రిలో చేరాడు. ఆరోజుల్లో తన జీవితం వేరు. ఆర్థికంగా యిబ్బందులుపడుతూ బ్రతుకు భారం బ్రహ్మచారైనా మోయలేక కుంటుకుంటూ నడిచే పాంథునిలా వుండేవాడు. ఇప్పుడు స్పెషల్ వార్డుకోసం వేయిన్నించి ఆలస్యానికి తట్టుకోలేక 'సీ' క్లాసువార్డులో చేరటానికి ఒప్పుకున్నాడు. తనకంటే వెనుక పేరు నమోదుచేసుకున్న వారికి వెంటనే దొరకటం, ఏమంటే మా యిష్టం అని జబాబు పొందటం యింకా తన మొదటి అభిప్రాయాన్ని మార్చటానికి అవకాశం యీయలేదు.

ఈ 'సీ' క్లాసువార్డులో నాల్గు మంచాలున్నాయ్. ప్రతి రెండు మంచాలమధ్య సీలింగుఫేన్లున్నయ్. మూడువేపులద్వారాలు ఒకవేపు గోడకు మందులు పెట్టుకోడానికి పెద్ద బీరువా వున్నయ్. రోడ్డు వేపున ద్వారంకు యినుపతీగ కప్పిన కటకటాల తలుపులు – అవి యెప్పుడూ తాళంతో బంధింపబడి వుంటయ్. ఆ తలుపులనించి వరండాలోనూ రోడ్డుమీదాపోయే మనుషులనూ, వాహనాలనూ చూడవచ్చు.

సూర్యం పడుకున్న మంచం ప్రక్క మంచం మీద యెవరో వ్యక్తి ఆవేశ వేకువర్షూమువే



పోయాడట! అందుకే ఆ మంచంమీద తను చేరేసరికి పరుపుకూడా లేదు. ఆ మంచం చూడగానే సూర్యం మనసు ఒక్కసారి దిగజారింది. కళ్ళల్లో నీరు పేరుకున్నయ్. గొంతుక పట్టుకపోయింది. ఇదివరకు అలాంటి మంచాన్నే ఉదయమే చూసాడు. గుండె బేజారెత్తిపోయింది. మళ్ళీ ఆసుపత్రికి బాధపెడ్తున్న అజీర్ణపువ్యాధికి సరియైన ట్రీట్‌మెంటు చేసుకోడానికి వస్తేయిప్పూ ఖాళీమంచం గతం జ్ఞప్తికి తేవటమే కాదు కళ్ళకు కట్టినట్లు ఆ దృశ్యాలను చూపిస్తోంది. ఏన్నోవిధాల మనసును సంధనపరచుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.

ఒకసారి యెదురుగానున్న రెండు మంచాల వేపు చూసాడు తన యెదురుగానున్న వ్యక్తిని యిదివరకు చూసాడు. ఆతని గురించి పదుగురినోట విన్నాడు. అతని ముఖంలో యేదో భయం తాండవిస్తోంది. ఆశెట్టిగారుకూడ తన జీవిత నాటకంలో ఒకపాత్ర వహించారు. అదీ ప్రధానపాత్రే. ఐనా అతనితో యిదివరకు ముఖపరిచయం లేదు. కనీసం మాట్లాడనైనాలేదు. ఓహో మీరా అని చనువుగా అనే సాహసం కూడా సూర్యానికి లేదు.

ఆప్రక్క మంచంలో వ్యక్తి శెట్టిగారిలా వయసులో పెద్దకాదు, ఇంచుమించు సూర్యం వయసు వుంటుంది. ముప్పయి సంవత్సరాలు నిండకుండానే జబ్బు ముదిమిని తెచ్చిపెట్టినా ఆ కళ్ళల్లో మెరపుమాత్రం అంటలేకపోయింది: తెల్లని [illegible] ముఖంలో

# కొత్త సీరియల్ నవల ప్రారంభం!

విరునగవు నిత్యం స్వతహాగా తాండ విస్తోంది. ఆ చూపుల్లో యెదుటివాళ్ళను సమ్మోహనంచేసే గుణం వుంది. అతను ఆలస్యంగా లేచాడు.

ఆ నాల్గు మంచాలవార్డులో సూర్యం వేరేసరికి వాతావరణం శోకమయమై వుంది. ఇంట్లో వ్యక్తి యెవరో పోయినట్లుగావుంది. ఏదో బరువుతో మనసు క్రుంగిపోయినట్లుగా నర్సులుకూడా కదులుతున్నారు.

'ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. నా పేరు శ్రీనివాస్' అంటూ ఆలస్యంగా లేచిన వ్యక్తివచ్చి సూర్యాన్ని పలకరించాడు

'నాపేరు సూర్యం !'

'వెల్ కమ్— వేగంగా కోలుకుని వెళిపోతారు.'

'ఎలా చెప్పగలరు ?'

'మీరు పడుకున్న బెడ్ అలాంటిది. లక్కీబెడ్.'

'మీదో.'

'నెలఅయ్యింది. ఏదీ తేల్చరు. ఇంకా జబ్బేంటో పోల్చుకోలేదట !'

'శెట్టిగారికి...'

'ఓయనకు హెర్నియా ఆపరేషను చెయ్యాలి ఉండవలసిన జబ్బులన్నీ వున్నయ్ సుగర్ కంప్లయింట్, హైబ్లడ్ ప్రెజరు...వగైరా.'

'శెట్టిగారూ! మన సూర్యంగార్ని కలుసుకున్నారా?'

'అయ్యా— నమస్కారం...' పరుపుమీద నించి లేవకుండానే శెట్టిగారు లంఘుకున్నారు.

'నమస్కారం' అన్నాడు సూర్యం.

'ఏం పనిచేస్తున్నారు?!

'ఆఫీసరు—నేవల్ ఫేక్టరీలో.!

'ఏమిస్తారు?'

'ఆరువందలు.'

'మంచిది' అంటూ మెల్లగా శ్రమపడి పరుపుమీద కూర్చొని,

'జబ్బేమిటి?'

'కడుపునొప్పి అప్పుడప్పుడు వస్తుంది. అజీర్ణం.'

'పిల్లలెందరు?'

'ఇంకా పెళ్ళికాలేదు'

'మీ వయసులో నాకు నలుగురు పిల్లలు

## నాలుగుమంచాలు

రోజులు మారిపోయాయి.'

'శెట్టిగారికి యెనమండుగురు పిల్లలండి. అందులో ఆరుగురు ఆడవాళ్ళు' అందుకున్నాడు శ్రీనివాస్.

'అమ్మయ్యో ఆరుగురే !' సూర్యం ఆశ్చర్యపడుతుంటే 'ఇంక ఒక్క అమ్మాయే పెళ్ళికుందిలెండి!'

శెట్టిగారికి కఫం కూడా చేసినట్టుంది. దగ్గుతూ వుమ్మితున్నాడు.

'రాత్రి బత్తాయి రసం తాగొద్దన్నానా? అందులో సేకరిన్ వేసి మరీ తాగారండి' శ్రీనివాస్ అనగానే సూర్యం యెదుటివాళ్ల బాగోగుల విషయం యింత పట్టింపు చేసుకుంటున్న వ్యక్తివేపు ఆదరణ, తృప్తితో చూసాడు.

'రాత్రంతా సరిగా నిద్దరలేదు. ఈ బెడ్‌మీద మనిషి వేకువ ఝామునే పోయాడు, రాత్రంతా జ్వరంగా వున్నా దగ్గరే వున్నాను. చాలా బాధపడ్డాడు. భార్యా వుంది, బావమర్ది వున్నాడు దగ్గర, పోయేటప్పటికి యెవరూ లేరు వాళ్ళు యెవరున్నా యేమి చెప్పేవాడో? ఆ కళ్ళు మూసేసరికి ఆ భార్య చెయ్యి ఆ నుదుటిమీద వుంటే యెంతో తృప్తితో చచ్చిపోను అదగా ఆ ప్రాణం పోయేటప్పుడు ఆత్మీయుల యేడుపు వినిపిస్తే యెంత హాయినిచ్చును ఆ యేడుపు సంతోషం యిచ్చేది. అతను బల్లగుద్దినట్లు నిజం చెప్పేవాడు. మొగమాటం అసలే లేదు వాడు ఇంద్రుడవనీయండి, చంద్రుడవనీయండి డాక్టరు మొదలు తోటీవాని వరకూ ఒకటే నిజాయితీ అతనిని చూస్తే ముచ్చట వేసింది. నిజం చెప్పి పదుగురిలో చెడ్డ అయిన వ్యక్తి. నా మనసు కుదటపడలేదు. అందుకే మీకు పలకరించడానికి ఆలస్యంగా వచ్చాను'

ఉపన్యాస ధోరణిలో శ్రీనివాస్ చెప్పుకుపోతుంటే సూర్యంనోట మాట రాలేదు. తను ఆలోచనలో నిమగ్నుడై గతంలోని సంఘటనలను మనఃఫలకం మీద మళ్ళీ ప్రదర్శించుకొని బాధ పడుతున్నాడు. ఒకసారి రాలిన కన్నీరును తుడుచుకుంటున్న సూర్యాన్ని చూసి శ్రీనివాస్ నవ్వుతూ—

— 'ఏమిటండీ మీది యింత లేత మనసు, నాకు యేడ్చేవాళ్ళని చూస్తే జాలివెయ్యదు, కోపం వస్తుంది. ఈ లోకంలో యేడవటానికి యేముంది చెప్పండి ?'

'అనుబంధాలు' సూర్యం మెల్లగా గొణిగాడు. 'ఈ అనుబంధాలు, సంబంధాలు మనిషిని పిరికిని చేసేస్తే వాటిని దూరంగా వుంచటం మంచిది. ఏడుపు సంతోషం వలన వస్తే అనుభవించడానికి నాకేం అభ్యంతరం లేదు. ఇంకోవిధంగా ఏడ్చేవాడు చేతకానివాడు.' శ్రీనివాస్ అందుకున్నాడు.

'ఏడుపుతో గుండె బరువు తగ్గిపోతుంది.'

'ఇంతకీ గుండె బరువెందుకెక్కాలి ? నాకు వెన్నెముక నిటారుగా నిల్చోడానికి వుండగా ముద్దలాంటి గుండె మీద ఆధారపడటం యిష్టం లేదు.'

'మనిషి మనుగడకే అది ముఖ్యం.'

'పిరికివారై మీరు దానికి ప్రాధాన్యం యిస్తున్నారు కాబట్టి ! పిరికివాళ్ళ గుండె జోరుగా కొట్టుకుంటుంది ధైర్యవంతుని గుండె వాడు చెప్పినట్లే వింటుంది. వెన్నెముకగల మహానుభావులు గుండెను కొద్ది క్షణాలు ఆపి, మరీ బ్రతకలేదా?'

సూర్యం వాదించే పరిస్థితిలో లేడు. శ్రీనివాస్ ఒకసారి సూర్యం ముఖంవేపు పరీక్షగా చూసాడు. అప్పుడే ఒక నర్సు అలా మందులుంచిన గోడ బీరువావేపు వెళ్తోంది. తెల్లని దుస్తులు వేసుకున్నా యౌవ్వనం కొంటె చూపు చూస్తోంది. నడక నాట్యం చేస్తోంది. నగవు నింపిన పెదిమలు ఆహ్వానిస్తున్నాయ్. వయ్యారం వగలుతోకూడి ఒళ్ళంతా ఒంపు సొంపులతో నిండుకుంది.

'గుడ్ మోర్నింగ్ సిస్టర్' అన్నాడు శ్రీనివాస్.

'వెరీ గుడ్ మోర్నింగ్' అన్నది ఆమె.

'ఏం అలా వున్నారు ?'

'రొంప పట్టింది'

'మందు తీసుకోలేదా ?'

'ఏమందూ పనిచేయటంలేదు.'

'నేనివ్వనా?'

ఆమె ఎంటెగా చూసి 'మీరు డాక్టరు అయ్యాక యిద్దురుగాని.'

'ఈ నెలరోజుల అనుభూతి జీవితం డాక్టరుకంటే డాక్టర్ని చేసేసింది — ఒక్క డోస్‌తో మీ రొంపను కుదర్చకపోతే నా

పేరు డాక్టరు శ్రీనివాస్ కాదు.'

'నన్నిలా బతకనివ్వాలని లేదా?'

'రొంపతో బ్రతకనివ్వాలని లేదు'

'హ్హా'

'శుభ్రంగా రొంపలేని ముక్కుతో బ్రతకండి. అప్పుడు ముక్కుతో ప్రాణవాయువు పీలుస్తారు. ప్రాణవాయువుతో రక్తం శుభ్రపడి ఒళ్లంతా ప్రాకుతుంది. ఉత్సాహంతో పరుగులు వేస్తారు. పూలవాసనలు చూస్తారు, ప్రకృతి అందాన్ని కన్నీరులేని కళ్లతో తిలకిస్తారు.'

'మీరో కవిగా పుట్టవలసింది మహానుభావా!'

'నేను కపినే!'

'కపికాదు కదా?'

'అంత అదృష్టమా? కోతులకున్న అభిమానం మనుషులకెక్కడుంది? మీరో జామికాయ విసరండి. కోతి అందుకొని చూసినచూపు చూడండి. మనిషి అందుకుని చూసినచూపు చూడండి. మనిషి మరచిపోతాడు. కోతి మరచిపోదు.'

'మీతో మాటాడుక్కూర్చుంటే నాకెలా అవుతుంది?' అంటూ కదలబోతుంటే

'మందు అక్కర్లేదా?'

'చూడనియ్యండి!'

శ్రీనివాస్ పొడుండబ్బీ విప్పి చూపిస్తూ 'ఒక్కపట్టు పీల్చండి' అన్నాడు. నర్సు ఒక్కపట్టు పీల్చింది. అదే తడవుగా తుమ్ములు ప్రవాహంలా రాజొచ్చినయ్ ఆమె తుమ్ములతో వెర్రెత్తిపోతుంటే వార్డులో ముగ్గురు పేషెంటులే కాక చాటుగా లోటలు, వార్డుబోయ్ అంతా కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వసాగారు. ఆమె రుమాలంతా తడిసిపోయింది. కళ్ళు యెర్రనయ్యాయ్. బుగ్గలు కందిపోయాయ్. ముఖం, మచ్చలతో సొట్టలుదేరిన యేపిలు పండులా పెట్టి అక్కడనించి వెళ్లిపోయింది.

'అంత పనెందుకు చేసారు?' అన్నాడు సూర్యం.

'ఆమెను గర్వం ఒక్క విషయంలోవుంటే బాగుండేది. అన్నివిషయాల్లోనూ వుంది. ఆమె తెలివితేటలు పరీక్షిద్దామని యింత పని చేసాను' గొణిగాడు శ్రీనివాస్.

'ఆడవాళ్ళతో ఆడుకోగలరు అదృష్టవంతులు' అన్న సూర్యం మాటలకు శ్రీనివాస్ ఒకసారి అతని ముఖంవేపు చూసాడు. ఆ ముఖం చిరునగవుతో వెలుగుతోంది అదే శ్రీనివాస్ ముఖంలో కరవుకాగానే సూర్యం ఆలోచనలోపడ్డాడు ముఖంలో మార్పులు తెరమీద బొమ్మల్లా కదలసాగినయ్. ఒకవ్యక్తిని చూడగానే ఆకారం మనసులో హత్తుకుంటుంది. మాటాడగానే ఆకారం మనసులో కదులుతుంది; ఇంకా అతని మనసును అర్థంచేసుకుంటే ఆ ఆకారం యెదుటివానితో ఐక్యమౌతుంది ఐక్యంకాగలిగే సన్నిహితత్వం యింకా వీళ్ళిద్దరిలో పాతుకోకపోయినా, అలా కావాలనేకోర్కె యిద్దరిలోనూ కలగసాగింది.

శ్రీనివాస్ కాస్సేపయ్యాక మూగబాసల నుండి బయటపడి 'శెట్టిగారి సంగతి మీకు తెలీదు కామోసు గొప్పసిరికి ఆయనకు. ఈవేళ కళ్ళుమూస్తే రేపటికి రెండో రోజు ఈ గుడ్డ చిరిగిపోతే యింకో కొత్త గుడ్డవస్తుందన్న ఆత్మవిశ్వాసం లేకపోతే యెలా చెప్పండి? చేతకానివాళ్ళలా మనం చావుగురించి యేడుస్తూ కూర్చుంటామా?'

శెట్టిగారు కాస్త కాళ్ళవేపు వచ్చి బొంగురుగొంతుతో 'అయ్యా — మీపేరు సూర్యంగారుకదూ— సూర్యంగారూ— పిల్లా, పాపాకని పెంచి పెద్దచేసి, ఇల్లూవాకిలీ, సంసారం – డబ్బు ఘనతా, కీర్తి అంతా నాదీ అనుకున్నాక— బాధపడకండా చచ్చిపోమంటారు శ్రీనివాస్‌గారు. అయ్యబాబోయ్ — భయపడకండా నేను యేదీ సంపాదించలేదు — సుఖపడలేదు. భయపడకండా చచ్చిపోను.'

సూర్యం చిన్న నవ్వు నవ్వాడు. ఆసుపత్రిలో చావుబ్రతుకులమధ్య కొట్లాటలు నిత్యం జరుగుతుంది. ఈ నిత్య సంగ్రామంలో కారే రక్తం, రాలే కన్నీరుతో కలిసి వరదలై పారుతుంటుంది. వరదలు మనుష్యులు పండించుకునే పంట పొలాల మీద పారి, ముంచి భీభత్సం చేస్తాయ్. ఆశతో యెదురుచూస్తున్న హృదయాలు ఆ పారే శబ్దంవలన వచ్చిన హోరుతో అల్లకల్లోలమైపోతాయి. ఈ ఆసుపత్రి యింత విచిత్రమైనది. ఇది ఒక తెల్లని కిరణం తెల్లని కిరణంలో దాగున్న అన్ని రంగుల్లా మనిషిలోనుండే అన్ని అనుభూతులనూ యేవో ఒక పాలులో అందిస్తుంది. సుఖంతోపాటు దుఃఖం, దుఃఖం వెంట వైరాగ్యం, వైరాగ్యంవెంట ఆశ, ఆశకడుపులో నిరాశ, నిరాశ హృదయంలో కోరిక! కోరికతో కృంగిపోతున్న జీవం పెనుగులాడి పెదవిపై చిరునగవు వెలగబోస్తుంది. ఆసుపత్రేకాదు. మనిషికి సంబంధించినవన్నీ విచిత్రమైనవి. మనిషే విచిత్రమైనవాడు!

ఈ చిత్ర విచిత్రమైన మనిషి, చిత్ర విచిత్రమైనవి అల్లుకున్నాడు. జీవిత విధానంలో, వూహల్లో, మనసులో, మాటల్లో, మెదడులోని విజ్ఞానంలో చివరకు అగపడని ఆత్మలోకూడ చిత్ర విచిత్రమైన జీవితాన్ని సృష్టించుకున్నాడు:

ప్రక్కనున్న ఖాళీమంచం, యీమంచంపైనున్న తను, ఎదరగా శెట్టిగారూ, శ్రీనివాస్ యీ చిత్ర విచిత్రమైన జీవితంలో అంతర్భాగాలుగా యే అర్థాలను సృష్టిస్తారో? సృష్టి వలన మనిషి ఉద్భవిస్తాడు. ఏదో సృష్టించనిది మనిషి చావడు. మళ్ళీ సృష్టించటానికే చచ్చిపోతాడు. సూర్యం ఆవేళ సూర్యోదయం తరవాత చేసిన పనులు, ఆలోచనలు, పొందిన అనుభూతులూ పైకెగసి యెగసి పడమటకు దిగజారుతున్న సూర్యునిలానే కృంగిపోగినయ్ శక్తి వుడిగి ప్రాకుతూ పోతున్న దినకరునిపై మబ్బులు దాడిచేసినట్లు సూర్యంకు నిద్ర మబ్బులు ముంచుకొచ్చాయ్.

అతను సాయంత్రం కాఫీ త్రాగాడు. రోడ్డువేపు కటకటాల తలుపు గుండా చూసాడు. రోడ్డు వెనుక యింకోవార్డు ఆవరణలో పెరిగిన బూజుచెట్లు. ఆ చెట్లపై వ్రాలేపక్షులు, వ్రేలాడే కాయలు, రాలే ఆకులు, మొలిచే చిగుళ్లూ చూసాడు. యెండకు మెరిసే పచ్చదనం వానకు తడిసి, చలిగాలికి వణికే చెట్లను వూహించుకున్నాడు కాస్త లేచి నిల్చొని పరీక్షగా చూస్తే దూరాన ప్రకృతి పచ్చదనపు పొట్టని చీల్చుకుని పైకెగసిన నీలికొండలు, కొండలపై తబ్బిబ్బులు నమబ్బులు, మబ్బుల మధ్య చిక్కుకున్న దినకరుని దైన్యంతో యెరుపుదేరిన బింబం! ఇంత అందం కొన్ని నిముషాల తరవాత నోరు తెరచుకుని దాగున్న చీకటి కడుపు

లోనికి పోసాగింది. ఇది ఒకసారి జరగదు. రోజూ సూర్యుడు ఉదయిస్తాడు. మళ్లీ క్రుంగిపోతాడు. ఈ మధ్యలో ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం—తరవాత చీకటి అలుముకుంటుంది చీకటి చావు. మళ్లీ ఆత్మ ఉదయిస్తుంది — మనిషిగా ప్రకాశిస్తుంది — మళ్లీ సాయంత్రం — తరవాత చీకటి!

*

చీకటిపడ్డాక సూర్యం పదే పదే ప్రక్క మంచంవేపు చూడసాగాడు. కబుర్లు చెప్పడానికి శ్రీనివాస్ జ్వరంతో పడి వున్నాడు. సాయంత్రమైతే జ్వరం యీ మధ్య అతనికి ముంచుకొస్తోందట. అతని దగ్గర చాలసేపు కూర్చున్నా ఖాళీ మంచం యేదో ఒకసారి కనిపిస్తోంది. ప్రక్కన శెట్టిగారి సంగతి చెప్పక్కర్లేదు సాయంత్రమే అతని విషయం బాగా తెలిసిపోయింది. భార్య, పిల్లలు, మనుమలు, మనుమరాళ్లూ అంతా మందగా వచ్చి పడ్డారు. చూడటానికి వచ్చే వాళ్ళ లెఖ్ఖలేదు. స్వజనం ముందు శెట్టిగారు కన్నీరు తెచ్చుకున్నారు. మనిషోలా ధైర్యం చెప్తున్నారు. వేలైనా ఖర్చుపెడ్తామని కొడుకులు హామీ యిస్తున్నారు చెప్తున్నంతసేపు శెట్టిగారి దృష్టి ఎదురుగానున్న ఖాళీ మంచంపైనుంది. బలవంతంగా ఆపుకుందామన్నా ఆ దృష్టి అటువేపే వుంది. వాళ్ళు వెళ్ళిపోతూ ఒక కుర్రవాడ్ని శెట్టిగారి దగ్గర విడిచిపెట్టేసారు. వాడికి పన్నెండేళ్లుంటాయ్ పెద డాక్టరు పెర్మిషను తీసుకుని వుంచారు. శెట్టిగారికి రాత్రుళ్లు కాళ్లు ఒత్తడానికి, అవసరమైనవి అందివ్వడానికీ — 'వెధవా — నిద్రపోకండా—యేం చెప్తే అది చెయ్యరా?' అని వార్నింగ్ యిచ్చి మరీ వెళ్ళారు. ఒకరు కాదు అందరూ వాడికి విధులను చెప్పి వెళ్ళారు.

ఒంటిగా శ్రీనివాస్ దగ్గర కూర్చుంటే రాత్రి డ్యూటీ నర్సు మాటి మాటికి వచ్చి చూస్తోంది తలమీద ఐస్ బేగ్ పెట్టింది. అలా కొంతసేపయ్యాక శ్రీనివాస్ పలవరిస్తున్నాడు వినగానే సూర్యం ఒక్షణం నిర్విణ్ణుడయ్యాడు. ఆతని వూహలతో సతమతమవుతుండగా శెట్టిగారి కేకలు వినిపించినయ్. కొంతసేపయ్యాక దగ్గుతూ లేచి 'రామం' అని మూలిగాడు అప్పటికే కుర్రవాడు పక్కన పెద్ద కిటికీ వరండలో పడుకున్నాడు, మళ్ళీ మూలగ్గానే సూర్యం అతనిదగ్గరగా వెళ్లి 'యేం కావాలండి శెట్టిగారూ?' అని అడిగాడు.

'ఎవరు? మీరా? చిన్నబాబు పడుకున్నాడా?'

శెట్టిగారికి బాగా తెలివి వచ్చింది. కామోసు 'కుర్రాడు...కుర్రాడండి.'

'పనికుర్రాడా?'

శెట్టి తలవూపాడు.

'పడుకున్నాడు. ఏమికావాలి చెప్పండి? నేను చేస్తాను.'

'మీరా? వద్దు—'

'ఫరవాలేదు—సంశయించకండి.'

'మీరు పెద్ద ఆఫీసరువారు — మీచేత సేవ.'

'సేవకు వాదాలతో ముడిపెట్టకండి. హార్లిక్సు కలపాలా?'

'ఊఁ' అని తలవూపాడు. సూర్యం హార్లిక్స్ కలిపి అతనినోట పోసాడు. త్రాగాక 'శ్రమపెట్టాను' అన్నాడు.

సూర్యం చిన్ననవ్వునవ్వి అతనిపై దుప్పటి కప్పుతూ 'పడుకోండి — చాల రాత్రయిందని' తన మంచంవేపు వెళ్లాడు. ఒకసారి బాత్‌రూమ్‌కు వెళ్లాడు. కారిడార్‌ను దాటివెళ్ళేసరికి జనరల్‌వార్డు యెదురైంది. మంచాలే కాకుండా వరండాల మీద రోగులున్నారు. ఒకడు బాధతో మూలుగుతున్నాడు. ఆ ప్రక్కవాడు జీవచ్ఛవంలా పడున్నాడు. క్రిందనున్నవాడు కుండంత పొట్టతో నిలువున పడుకున్నాడు. ఇంకొకడు నల్లులను తిట్టూ పరుపుమీద దొర్లుతున్నాడు. రాజకీయాలిద్దరూ చర్చించుకుంటున్నారు. ఒకచేయి చావు, యింకోచెయ్యి బ్రతుకు పట్టుకుని లాగుతున్న ఒక వ్యక్తి ప్రాణవాయువు గొట్టాలు ముక్కులో పెట్టుకుని పెనుగులాడుతున్నాడు. ఇలా రకరకాల వ్యక్తులు, రకరకాల బాధలు, రకరకాలుగా అనుభవిస్తున్నారు.

సూర్యం తిరిగి 'సి' వార్డులోనికి వచ్చేసరికి వరండాలోని దీపం కాంతే వార్డులో పడుతోంది ఆ వెలుగులో దెయ్యంలా ఒక వ్యక్తి తన పరుపు దగ్గర నిల్చున్నాడు.

'ఎవరు నువ్వు?'

'తోటీని'

'రాత్రి డ్యూటీవాడవా?'

'అవును బాబూ!'

'ఇక్కడేం నిల్చున్నావ్?'

'మీకు తెలీదా బాబూ?'

'ఇంకా వుంటాననుకదోయ్'

'ఏమో బాబూ? మాము ఆరుగురం'

'నాది పెద్దజబ్బు కాదోయ్ — టెమ్పరరీగా వచ్చాను'

'అదికాదు బాబు—మీరిచ్చినప్పుడికి మేం వుంటామో లేదో?'

'వెళిపోతే యిస్తాను',

'మా రివాజు యిది'

'ఏది?'

'ముందుగానే పుచ్చుకోడం'

'ఇవ్వకపోతే'

'తమరిక్కడ వుండలేరు'

'ఏం?'

---

ఊర్. గుంచో !!



'ఎవ్వరూ మీ మాట వినరు సరికదా యింకేం చేస్తారో చెప్పలేం బాబూ?'

'ఏదో చూస్తాను'

'అంతపట్టు పట్టకండి బాబూ — ఈ సరికి యిలా నడుస్తున్నారు. రేపు పరుపు నించి దిగలేరేమో? అప్పుడు తమకి యీ మాటలు రావు. మామూలు పిల్లలుగలోలం — గవర్నమెంటు యిచ్చినది బియ్యం గింజలకే రావు. ముందుగా తీసుకోకపోతే యేయిదాన యెరిపోయినా రాబెట్టుకోలేం. మేం బతకడానికి మీలాంటి కష్టాలు పడినోలదగ్గరే గుంజుకోవాల. సూడండి మరి. సుఖంగా వున్నోళ్ళా ఆ శెట్టిగారు యెంగిలిసేతో కాకి్క పెట్టలేదు. కష్టంరాగానే యేలు యిరజిమ్ముతున్నాడు. ఆడే సరుకులు సవగ్గా యిమ్మంటే యిప్పుడింత గుంజేవాళ్ళమా? మేం లంచం అడగే అడగం. మీలాగ జీతాలు పెంచండి. మీ పెళ్ళం పిల్లలంతైనా వద్దు. అందులో సగం ఖర్చు మా కివ్వండి. ఒక్క పైసాకి సెయ్యి సాపితే వొట్టు.'

ఇంత పెద్ద ఉపన్యాసంలో నిజానిజాలు ఆలోచించుకుంటూనే సూర్యం 'రేపొద్దున్న కనపడు' అన్నాడు.

'అలాగే బాబూ! కష్టం తెలిసిన బాబులావున్నావు.'

సూర్యం వెళిపోతున్నవాణ్ని పిలిచి 'నివ్వు సేవచేస్తున్నందుకు యివ్వలేదు మీ కడుపు విషయం బాధపెట్టినవాడిలో నేనొకణ్నని యిస్తున్నాను.'

'ఎలాగో ఒకలాగయియ్యి బాబూ' అంటూ వెళిపోయాడు.

# నాలుగుమంచాలు

వీడు వీళ్ళలీడరులా వున్నాడనుకున్నాడు, సూర్యం. అనుబంధాలగురించే మళ్ళీ ఆలోచించుకున్నాడు. ఈ సంఘం ఒకమేడ అనుకుంటే కలవారంతా ఆ యింటికప్పు వంటివారు. గోడల్లో యిటికల్లా ప్రతి మనిషీ అవసరం యేదో ఒకటివుంటుంది. ఏ యిటిక రాలినా కప్పుకూలే అవకాశం వుంది. అంతస్థులున్న మేడకు పునాదులు వీళ్ళే. అది గమనించనినాడు పునాదులు బలహీనమౌతాయి. మేడకూలిపోయే అవకాశం వుంది. నిద్దరపట్టకపోవటంవలన సూర్యం యేవేవో ఆలోచించుకున్నాడు. ఇంతలో యెవరో కెవ్వున కేకవేసారు. తరవాత వర్షధారలా యేడుపు వినిపించింది. లేచి ఓక్షణం శ్రీనివాస్ దగ్గర వున్నాడు. శ్రీనివాస్ తెలివిలేకుండా పడి వున్నాడు. ప్రక్కగదిలో డ్యూటీ డాక్టరు, నర్సు యేదో మాటాడుకుంటున్నారు. కాస్సేపయ్యాక వరండాలోనించి ఒక శవం మోసుకుపోతున్నారు. శెట్టిగారికి తెలివి వున్నా రెండోవేపు తిరిగిపోయాడు ఎదురుగా మంచం వివిధమైన అకారాలతో అగుపించింది. వానిపై యెవరో కూర్చున్నట్టు అనిపించింది. నిదరపోడానికి ప్రయత్నించాలని తన మంచంమీదకు వచ్చేసాడు. ఒళ్లంతా కప్పుకుని ప్రయత్నించినా నిదరాలేదు. ఈ పరుపుమీదా యెందరు చచ్చి వుంటారో, ఒక్కొక్కడి జీవితం ఒక గ్రంథం కాగలదన్న వూహ రాగానే మనసులో కాస్త పిరికి ఆవరించింది. కడుపులో కొద్దిగా నొప్పిగావుంది. జబ్బులు చెప్పి రావు. ఒకోసారి చిన్నజబ్బే సడన్‌గవచ్చి ప్రాణం బలిగొంటుంది. మనిషి యే అవయవాలను నమ్ముకుంటాడో, యేవి తన స్వంతం అని విర్రవీగుతాడో అవే చెప్పినట్టు వినవు. అలాంటప్పుడు తన క్రింద ఉద్యోగులు, పైనున్నవాళ్ళు, చుట్టూవున్న సంఘీయులు తను చెప్పినట్లు వినాలనటం చాలా హెచ్చు కాంక్షించటమే అవుతుంది.

ఇలా జీవితంలో తను యెన్నెన్నో యెదుటివారి దగ్గరనించి కాంక్షించాడు. పిరికినించి మనసు మళ్లించడానికి మంచి మంచి విషయాలు ఆలోచించడానికి ప్రయత్నించాడు. మనసు ఎంతో సంతోషంతో నిండడానికి స్వచ్ఛమైన పాలలాంటి చిన్ననాటి జీవితం, పానకంలాంటి ప్రేమతో వుప్పొంగిన యౌవ్వనంలోని ఘట్టాలు తలచుకోడానికి ప్రయత్నించాడు. పాలులో ఓ మజ్జిగచుక్క పడి విరిగిన రోజులు, పానకంలో పుడకలు బయలుదేరిన దినాలున్నయ్. ఐనా తలచుకోకుండా వుండలేకపోయాడు.

సూర్యం తన తండ్రి తరవాత ఆ కుటుంబంలో తొలి మొగబిడ్డ. అతని పుట్టుక ఆనందాన్ని వెదజల్లింది. ఆశలను రేకెత్తించింది. అతనిని వంశోద్ధారకుడన్నారు. పితృలకు పిండాలు పెట్టి ఋణం తీరుస్తాడన్నారు. అంత జరుగుబాటున్న యిల్లు కాకపోయినా నిజాయితీకి పేరుపడ్డ కొంప. ఆ చుట్టుపట్ల చదువుకు గుత్త కొన్న యిల్లు. ఎవరికే సలహా కావాలన్నా, యే సందేహం తీర్చుకోవాలన్నా, మంతనాలాడాలన్నా, కార్యాలు చెయ్యాలన్నా సూర్యం తాత దగ్గరకు రావలసిందే. సూర్యం బాలునిగా చాలా ముద్దుగా తాతచేతిలో పెరిగాడు. తల్లికన్నా మిన్నగా చూసాడు. ఒకో రాత్రి పాలు చాలక యేడుస్తుంటే రాత్రి మీద యే దొడ్లో దూడనైనా విప్పి పాలు పితికి మరీ తెచ్చేవాడు. ఆ మరునాటి రోజు వుదయం 'మా నువ్వు మనికోసం యిలా చేసావురా' అని కబురు పెట్టేవాడు. అతని వలన ఆర్థికంగా కాకపోయినా ఆధ్యాత్మికంగా వుపకారం పొందిన వాళ్లవటంవలన యెవరూ యేమీ సంకోచించేవారు కాదు.

(ఇంకా ఉంది)



# వారఫలం

**17.3.1972 శుక్రవారం మొదలు**

**23.3.1972 గురువారం వరకు**

**మేషం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** అనవసరమైన శ్రమ కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**మిథునం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం:** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య:** మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో సంతోషకరమైన వార్తలను వింటారు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగుంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**తుల:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు:** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం:** మీ మంచితనమే మీకు యిబ్బంది కలిగిస్తుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు— బంధుమిత్రులను కలుసుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం:** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీవారిపోటీ తగ్గుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్



'అరుంధతిని చూపిస్తాను లేవవోయ్ పెళ్ళికొడుకా— నువ్వుకూడా లేవమ్మా' అన్నాడు పురోహితుడు.

'వెనకటికెవరో అన్నారుట లెండి అరుంధతి కాదుకాని ఆరువేలు అప్పు అగపడుతోందని' అన్నారొకరు.

'ఇప్పటి పెళ్ళికొడుకులకి ఆ బాధ లేదుగా! అప్పులేవయినా ఉంటే అవి పెళ్ళితో తీర్చుకోవచ్చును కూడా!'

వీర్రాజుకి నవ్వొచ్చింది. 'ఏమండోయ్ పంతులుగారూ, మీరిలా మాట్లాడేస్తే నేను గొప్పగా తీసుకున్నాననుకుంటారు అంతా పైస లేదండి బాబూ—పెద్ద లాస్' అన్నాడు

అందరూ గొల్లున నవ్వారు.

పెళ్ళికూతురు ఓరగా వీర్రాజువంక చూసి తల మరి కొంచెం కిందకు దించుకుంది.

'లేవండి లేవండి, ఏవో పెద్దలు పెట్టిన ఆచారాలన్నీ ఆచరించి ఇదొక్కటె వదలడం దేనికి? రావయ్యా కుర్రాడా',

అందరూ బయటికి నడిచారు.

'ఆఁ, అమ్మాయ్ పద్మావతీ అటు చూడమ్మా, ఆ నక్షత్రం పక్కనఉన్నదే అరుంధతి అంటే' చూపించాడు పురోహితుడుగారు.

'పిల్ల కొంచెం పొట్టి. కుర్చీ ఏమయినా వేయించండి పంతులుగారూ, అరుంధతికి కొంచెం దగ్గరవుతుంది,' అన్నాడు వీర్రాజు పద్మవంక చూస్తూ.

పద్మావతికి చిరుకోపం వచ్చేసింది. అతను తనమీదికిలా వంటికాలితో వచ్చేయడం నచ్చలేదు 'ఎత్తుకోరాదూ—మళ్లీ కుర్చీఎందుకు ?' అంది విసురుగా.

అండమే తడవుగా నడుముపట్టుకుని ఎత్తేయబోయాడు వీర్రాజు.

సిగ్గుపడిపోయింది పద్మ. అతన్ని విదిలించుకుని 'ఛీ పాడు—మొండి' అంది మెల్లిగా.'

'ఏమిటేవ్ పిల్లా, నోటికొచ్చినట్లు అంటున్నావు నువ్వెంత మెల్లిగా అన్నా నే వినలేదనుకున్నావా ? 'ఎత్తుకోరాదూ' అన్నావు. అంతపనీ చేశాడు మావాడు... అసలేవాడు శతమొండి తెలుసా ?'

అందరూ నవ్వారు.

లోపలికి వచ్చేస్తుంటే పద్మ చేయి పుచ్చుకుని గిల్లాడు వీర్రాజు. చివాలున తలెత్తి 'నేనూ గిచ్చగలను తెలుసా ?' అంది పద్మావతి.

'ష్' అన్నాడు వీర్రాజు. 'నేను ఇద్దరు మనుషులని చూపించుతాను వాళ్లని గుర్తుంచుకో. తరువాత వాళ్లతాలూకు కథలు చెప్తాను.'

కథలనేప్పటికి పద్మావతికి ఉత్సాహం కలిగింది. 'అలాగే' అన్నట్లు తల ఊపింది.

'అబ్బబ్బ ఈ రోజుల్లో పిల్లలకి పెళ్లిపీటల మీదనుంచే మొదలు ఇటువంటి విషయాలు మాట్లాడుకోవడం.' వెనక నుంచి ఒకరు బాణం వదిలారు.

'ఇంకా నయంకాదూ! కొందరు కొందరయితే పెళ్లిచూపుల్లోనే ప్రశ్నలు వేసుకుంటున్నారు. ఫామిలీ ప్లానింగ్ మీద మీ అభిప్రాయం ఏమిటి ? మీరేం వాడతాను అనటూనే'

వీర్రాజు మళ్లీ గిచ్చాడు పద్మావతిని. గబాలున అతనివంక చూసి తరువాత చుటుక్కా చూసింది పద్మ.

'అదుగో మా చెల్లాయికి ఎడంపక్కన కట్టుచీర కట్టుకోలా !'

'చాలా బాగుంది.'

'ఏమిటి నట్టుచీరా ?'

'ఛస్. ఆ అమ్మాయి'

'కరెక్ట్, అవుతే గుర్తు ఉంటుందన్న మాటేనా ?'

'ఊ' అన్నట్లు తలూపింది.

'ఒరేయ్ వీర్రాజూ, ఈ ఒక్కరోజు ఓపికపట్టరా నాయనా— మీరిలా మాట్లాడేసుకుంటూ ఉంటే మాకు సిగ్గేస్తోంది'

'ఏడిశావు లేవోయ్. నీ గ్రంథం నాకు తెలియనిదా — సభ ఏటూ ఉంది చెప్పమంటావా ?'

'నేనేదది కాదురోరేయ్, మాట్లాడేది పెద్దగా పబ్లిగ్గా మాట్లాడుకోండి గుసగుసలు వద్దు'

వీర్రాజు నవ్వాడు 'నీకు వినబడి చావడం లేదనా ఏడుపు— సర్లే'

ఒక తతంగం పూర్తి అయి రెండవ దానికి ఏర్పాట్లు చేసేందుకు లోపలికి వెళ్లాడు పురోహితుడు. జనాభా అంతా భోజనాలకి లోపలికి వెళ్లిపోయారు.

వీర్రాజు ఇక చెప్పడం మొదలెడతాడనుకుని ఎదురుచూసిన పద్మావతి అటూ ఇటు చూసి అతన్ని మెల్లిగా తట్టి 'చెప్పండి' అంది.

'ఇందాక నువ్వు చూసిన అమ్మాయి ఇప్పుడు నువ్వున్న పీటమీద కూర్చుండేది తెలుసా ?' అన్నాడు నవ్వుతూ.

'అంటే' అన్నట్లు చూసింది,

'పెళ్లితంతులో సగం నాకు ఇదివరకే జరిగింది. అప్పుడు పెళ్లికూతురు ఆ అమ్మాయి !'

అంటే ఏమిటో బోధపడలేదు పద్మావతికి. 'నేను తలవంచుకుని వింటూ ఉంటాను. గబగబ చెప్పండి మళ్లీ ఎవరయినా వస్తారు' అంది తలవంచుకునే.

'అసలు చెప్పను.'

'ఏం ?'

'మనం చేస్తున్నది తప్పుకాదు.'

'కాకపోవచ్చు. కాని ఎవరయినా చూస్తే సిగ్గుగా ఉండదూ ?'

వీర్రాజు నవ్వాడు. 'రేపు అందరెదుటా గదిలోకి వెళడం సిగ్గెయ్యదూ ?'

'ఛీ వెధవమాటలు !'

'తలెత్తకపోతే ఇంతే'

నవ్వుతూ తలెత్తి అతని ముఖంలోకి చూసి 'చాలా ?... మొండి' అంది పద్మావతి.

'గుడ్. నాగురించి ?అప్పుడే కొంత తెలుసుకున్నారన్నమాట ! పూర్తిగా తెలిసేందుకే ఈ కాశీమజిలీకథలు, చెప్పబోతున్నది... ఎక్కడున్నాము ?'

'పీటలమీద !'

'కరెక్ట్. నువ్వుండేదానివి కాదనికదూ అన్నది ! ఆ అమ్మాయి మిసెస్ వీర్రాజు అయుండేది.'

ముఖం చిన్నబుచ్చుకుని 'చెప్పండి' అంది పద్మావతి.

'నేను చిన్నతనంలోనే పెంపుడు— అంటే దత్తతకి వెళ్లాను తెలుసా ?'

'అవునట !'

'నన్ను పెంచుకున్న వాళ్లకి బోలెడు ఆస్తి ఉంది, పిల్లలులేరు. లేకపోబట్టే నన్నుకో దత్తుకు తీసుకునేది. మా అమ్మకి అస్సలు ఇష్టంలేదు. నేనేం వాళ్లంత జమీందారును కాకపోవచ్చును. కాని నాకున్నదానిలో నేను నా పిల్లల్ని పెంచ లేకపోను. నాకు ఇష్టంలేదు' అని అడ్డం పడింది.

'అడిగింది పరాయిదికాదు. నీకు అక్క అవుతుంది. వాడు అదృష్టవంతుడవుతే మనం కాదనడం దేనికి ?' అన్నారు నాన్న.

'నీకులేదని కాదమ్మాయ్, మాకులేదని. కళకళ్లాడుతూఉండే పిల్లలగల ఇల్లునీది. అటువంటి ఆనందం మాకూ కలిగించమని అడుగుతున్నాం. నీకూ నీ కొడుక్కి దూరం చేయం. మేమున్నది ఇక్కడనుంచి రూపాయి టికటులో ! ఎప్పుడూ వాడిని చూడాలని నీ కనిపిస్తే అప్పుడు కాకితో కబురంపు — తీసుకొచ్చి చూపిస్తాను' అన్నారు నన్ను పెంచుకుందామనుకునే ఆయన.

ఇదంతా నేను బాగా పెద్దవాడి నయాకనే ! అందుకే నాకూ బాగా తెలుసు. నాకూ ఇష్టంలేదు. మొత్తానికి అంతా కలిసి అమ్మని ఒప్పించారు. ఆవునుంచి విడదీసిన దూడలా అయింది నా పని.

కొన్నిరోజులు వాళ్లు అన్నమాటను నిలుపుకున్నారు. నన్ను పెంచుకున్న వాళ్లు... పెంపకాలెప్పుడూ పసివయసులో జరగాలి. అప్పుడే వాళ్లతో కలిసిపోతాడు తెచ్చుకున్నవాడు. మీసాలు వచ్చే వయస్సులో వెళ్లిన నేను వాళ్లని. 'అమ్మా' 'నాన్నా' అని ఎలా పిలవగలను ?

నేను మా అసలింటికి తరుచు వెళడం వలన వాళ్లని మర్చిపోలేక పోవడమే దాని క్కారణం అనుకున్నారు వీళ్లు. కేవలం నాచేత 'అమ్మ, నాన్నా' అనిపించు

కోవడంకోసం; దీనికి మావాళ్ళు అడ్డం అన్న దురుద్దేశంతో వాళ్లతో పోట్లాటలు పెట్టుకుని, వాటిని పెంచి వాళ్ళతో మాట్లాడడం మానేశారు. రెండిళ్ళకి రాకపోకలు లేకుండా చేసేశారు. ఆతరువాత నామీద ఆంక్షలు పెట్టారు. నేను పొరపాటున వాళ్ళతో మాట్లాడినట్లు తెలిస్తే నన్ను పెంచుకున్నావిడ ఏడుపులు మొదలెట్టేది.

కేవలం నామీద ప్రేమతో నన్ను వాళ్ళకి దగ్గర చేసుకోవాలన్న తాపత్రయంతో ఇదంతా చేశారని నాకు తెలుసు అందువల్లనే వాళ్ళని ఏమీ అనలేక పోయాను. మొదటనే ఒప్పుకోకపోవడం మంచిది, తీరా ఒప్పుకుని వచ్చాక వాళ్ళకి అనుగుణంగానే ఉండాలి అన్నది నా సిద్ధాంతం.

అలాగే ఉన్నాను కూడా! నన్ను పెంచుకున్నవాళ్ళకిది చాలా ఆనందం కలిగించింది; నన్ను దేముడిలా చూసే వాళ్ళు. నేనూ ఆ పరిస్థితికి రాజీపడి పోయాను.

నీకిందాక చూపించిన అమ్మాయి వాళ్ళకి బంధువులు. ఆమాటకొస్తే మాక్కూడా ననుకో. బాగా ఆస్తిపరులు వాళ్ళు. వాళ్ళకి వీళ్ళకి అన్నివిధాలా సరిపోయేస్థితి ఇద్దరిదీను. ఆ అమ్మాయి చాలా బాగుంటుంది— నాకూ అభ్యంతరం లేకపోయింది. ఆకాశమంత పందిరి వేయించాడు వాళ్లనాన్న. ఆయనే స్వయంగా నన్ను బజారుకి తీసుకువెళ్ళి నాకు కావలసిన బట్టలు కొన్నాడు. నాచేతనే ఏరించి వాళ్ళమ్మాయికి చీరలు కొన్నాడు మా సంసారాని క్కావలసిన బీరువాలు, టేబుల్స్, సామానులు ఒకటేమిటి అన్నీ నా పర్యవేక్షణలోనే కొన్నారు.

అంతా సక్రమంగానే జరిగుండేది నేను అడ్డం పడకపోతే— ఇన్ని ఏర్పాట్లు జరుగుతున్నా నా అసలు తల్లిదండ్రుల్ని పిళ్ళు పిలిచినట్లు కనిపించలేదు నాకు. అడిగే ధైర్యం లేక, అంతపని చేస్తారా అన్న అనుమానంతో చివరదాకా ఊరుకున్నాను. చివరికి తరలివెళ్ళే సమయం వచ్చేసింది. 'మా' వాళ్ళెవర్నూ నాకగపడలేదు. సమయం మించుతోందనిపించింది నాకు. ధైర్యం తెచ్చుకుని నన్ను పెంచుకున్న అమ్మని

# సఖికి సలహాలు

అడిగాను 'మా వాళ్ళని పిలిచావా?' అని.

'మేమంతా నీ వాళ్ళం కామట్రా పిచ్చి నన్నాసీ! ఆ సూటు వేసుకో ముందు. బయట కారు సిద్ధంగా ఉంది' అందావిడ బంగారు సణుచుకుంటూ.

నాకు మొండితనం వచ్చేసింది. 'పిలిచావా పిలవలేదా?' అనడిగాను ఘట్టిగా.

భయపడిపోయిందావిడ 'ఏమండోయ్, చూడండి వీడు' అంటూ ఆయన్ని పిలిచింది.

. అందరూ పోగయ్యారు.

'వాళ్ళని పిలిస్తేగాని— వాళ్ళొస్తేగాని నేను కారెక్కను' అని తెగేసి చెప్పాను.

ఆయనకీ కోపం వచ్చేసింది. 'కారెక్కక ఏమి చేస్తావేమిటోయ్?' అనడిగాడు. తెగేదాకా లాగడం అంటే అదే!

'పెళ్ళి చేసుకోను'

రెచ్చిపోయాడాయన. 'మాట ఇచ్చాను వాళ్ళకి జరిగితీరాలిసిందే!' అన్నాడు.

'వీల్లేదు. వాళ్ళని పిలవండి వస్తాను.'

'పిలవను. మేమిద్దరం ఉండగా వాళ్ళెవరు నీకింకా?'

'కన్నవాళ్ళు'

'అయితే వాళ్ళదగ్గరకే పో— అడుక్కుని తిందువుగాని!'

వెంటనే లేచి నిలబడ్డాను జరుగుతున్నదేమిటో వాళ్ళకి తెలిసేలోగా, నాకూ పూర్తిగా అర్థం అయేలోగా— బయటికి వచ్చేశాను. ఎదురుగా పెళ్ళికూతురు తండ్రి అగపడ్డాడు. 'విన్నారుగా మాష్టారూ, ఆస్తిలేనివాడిని. చదువుంది కాని ఉద్యోగం లేనివాడిని. మీ అమ్మాయిని చేసుకునేందుకు నేను సిద్ధమే! మీకూ ఇష్టం అయితే నాతో రండి— మా అమ్మవాళ్ళ దగ్గరకు పోదాం. వాళ్ళు కాదనరు!' అన్నాను.

ఆయన మాట్లాడకుండా నావంక కాసేపు చూసి 'అదెలా నాయనా, ఏదో సర్దుకుపోవాలి. అంత మొండిపట్టుదల ఉండకూడదు నీకే నష్టం' అన్నాడు.

'మరి శలవు' అని గబగబ రోడ్డెక్కాను. అంతే'

'మరి ఆ అమ్మాయికి పెళ్ళయిందా?' అన్నాడు వీర్రాజు. 'లేకపోతే మాటకిచ్చినప్పుడు నాకయిపోయిందిగా. ఇక లాభం లేదు.'

'అన్నీ తిక్క సమాధానాలే. అమ్మాయికయిందా అని అడుగుతున్నాను'

'అయిందనుకుంటా! ఇప్పుడు నే చేసుకోబోయే అమ్మాయి ఎలా ఉంటుందోనని చూసేందుకు వచ్చినట్లుంది'

'ఆ అమ్మాయి ముందు నేనెంత? చాలా బాగుంది. పొరబాటు చేశారు. అంత పట్టుదలా!'

'అదే ఈ కథ చెప్పడంలోని ఉద్దేశ్యం. నేను రైటనుకున్నది జరిగి తీరాలిసిందే. అందులో నాకు పట్టుదల ఎక్కువ. అందరూ దాన్నే మొండితనం అంటారు... శాస్త్రుల్లుగారు వస్తున్నారు...ఏం మహాశయా ఇంకా ఎంతసేపు ఈ పొగలో మాకీ పనిష్మెంటు?'

'ఇందాక నుంచి తలలు వంచుకుని ఇదే పనిగా గుసగుసలాడుతున్నారు— పనిష్మెంటంటాడు పైగా! ఏకాంతం కలిగించాడోయ్ నిను పంతులుగారు!'

'నువ్వెక్కడే తగలడ్డావేమిట్రా ఇందాకనుంచి? శిశుపాలుణ్ని క్షమించినట్లు ఒదిలేస్తున్నానోరేయ్ నిన్ను. రెండవ తప్పిది' అన్నాడు వీర్రాజు నవ్వుతూ.

ఎవరూ చూడకుండ వీర్రాజుని గిచ్చింది పద్మావతి.

'ఏమిటే నువ్వు మొదలెట్టావా ఈ సారి?' అనడిగాడు వీర్రాజు.

'ఏ. ఇద్దరి కథలు చెపుతానన్నారు. ఒక్కటే అయింది' అంది మెల్లిగా.

నవ్వాడు వీర్రాజు 'ఓహో అదా— గుర్తుంది. నువ్వు చెప్పద్దు అన్నా చెపుతాను తెలుసా! అసలు మనం నమస్కారాలు పెడతాం చూడూ, అప్పుడు ఆవిడ్ని చూపిస్తాను. గుర్తు పెట్టేసుకో! అన్నాడు...

'ముందు నాన్నగారికి, అమ్మగారికీ— తరువాత మామగారికి అత్తగారికీ...' పురోహితుడు చెపుతుంటే వాళ్ళ కాళ్ళమీద వాలిపోతున్నారు పద్మావతి, వీర్రాజు.

మధ్యలో పద్మావతి చేయిపుచ్చుకుని గబగబ ఒక పెద్దావిడ దగ్గరకు తీసుకెళ్ళాడు వీర్రాజు 'ఏమండీ, బాగున్నారా? కాళ్ళు పట్టండి' అని పద్మావతి చేయి గిచ్చాడు.







# చక్కని తెలుపు
# చిక్కని నలుపు
# సరియైన ప్రతిబింబం
# పెద్ద చిత్రాలను
# తీసుకోగల సావకాశం
# పొగమంచులో కూడా
# పనిచేస్తుంది

సుస్పష్టమైన ప్రింట్లు మరియు ఎన్‌లార్జిమెంటుల కోసం, ఆగ్ఫా-గెవార్ట్ ఫోటో పేపరునే కావాలని అడగండి. ఎంత చక్కని ఫోటోలనైనను, చవకబారు ఫోటో పేపరు వాడితే చెడిపోతాయను విషయమును జ్ఞాపకమును ఉంచుకోండి. ఆగ్ఫా-గెవార్ట్ ఫోటో పేపరు కలకలలాడే ఫోటోలకు చాలా నమ్మకమైనది. ప్రకాశము కొరకు, విశదమైన వ్యత్యాసానికి.
లుపెక్స్—ఎటువంటి నెగెటివ్‌ల నుండియైన పరిణతి పొందిన ఫోటోల నిచ్చే కాంటాక్టు పేపరు.
బ్రోవిరా—మీ చిన్న చిన్న ప్రింటులో దాగియున్న అందాలను చూపించే ఎన్‌లార్జింగ్ పేపరు.
ఆగ్ఫా-గెవార్ట్ అధీకృత విక్రయదారులందరి వద్ద దొరుకుతాయి.
ఆగ్ఫా-గెవార్ట్ వారి సహకారంతో:
ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్‌చే తయారు చేయబడినది.






సోల్ డిస్ట్రిబ్యూటర్లు:




## ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్,

బొంబాయి • క్రొత్త ఢిల్లీ • కలకత్తా • మద్రాసు.

® ఫొటోగ్రాఫిక్ వస్తువుల ఉత్పత్తిదారులైన ఆగ్ఫా-గెవార్ట్ అంట్‌వెర్ప్/లివెర్కుసెన్ యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

నమస్కారాలు పెట్టడంతో అలిసిపోయిన పద్మ ఉలిక్కిపడి 'అబ్బ' అంది.

'అమ్మాయికి నడుంనెప్పిపుట్టినట్లుందిలే నాయనా — ఇప్పుడు నాకు నమస్కారం పెట్టకపోతే ఏం పోయిందిట' అందావిడ.

'భలేవారే' అని తరువాత వాళ్ళ కాళ్ళ కోసం కదిలాడు.

రిసెప్షన్‌కి కుర్చీల్లో కూర్చున్నప్పుడు అడిగాడు 'గుర్తుందా ఆవిడ?' అని

'రక్తం వచ్చేట్లు గిచ్చారుగా!'

'ఇంకా అతిథి దేముళ్ళు రాకకి టైం ఉంది—మొదలెట్టనా?'

'ఊఁ'

వెనక్కిచూసి ఫకాలున నవ్వాడు వీర్రాజు. 'ఒరేయ్ శిశుపాలుడా, మళ్ళీ వెనక చేరావు — మూడవతప్పు. సర్లే, నందయేలోపల ఎక్కడయినా విష్ణుచక్రం సంపాయిస్తాలే!'

'పొదిచాలు — చెప్పండి' అన్నట్లుగా కాలుమీద మెల్లిగా కాలితో తొక్కింది పద్మావతి.

'పిల్లా కాళ్ళు తొక్కడం నేర్చుకుంటోంది' అంది వెనకనుంచి వీర్రాజు అప్పగారు.

'ఇందాకనుంచి బావ నీకోసం వెతుకుతున్నాడే—నిన్నుచూసి అప్పుడే అరగంట అయిందిట పాపం!' అన్నాడు వీర్రాజు;

'సర్లే, పాతకాలంవాళ్ళం కనుక అరఘంటకి బాధపడ్డారాయన. అరనిమిషానికే వెతికేట్టుంది మీ ఆవిడ.'

'నీ తమ్ముడు నిన్ను అంటే మధ్యన ఆపిల్లేంచేసింది నిన్ను!'

'నన్ను కాదులే అత్తయ్యా, మావాడి కాళ్ళు తెగ తొక్కేస్తోంది. పాపం వాడేమో నోరు మెదపలేక పోతున్నాడు' అని నవ్వి 'ఆయన కాఫీకోసం కాబోలు తిరుగుతున్నది—లేకపోతే చీట్లపేకమధ్య నేను గుర్తురావడం కూడానా!' అంటూ వెళ్ళిపోయింది.

'ఆవిడకి ఒక్కడే కొడుకు' అన్నాడు వీర్రాజు.

'అదేమిటి— ఇద్దరు మగపిల్లలు, భలేవారే!' అంది ఆశ్చర్యంగా పద్మావతి.

'నీముఖం. అక్కయ్యకి కాదు ఇందాకటావిడకి!'

నవ్వేసింది పద్మావతి.

# సఖికి సలహాలు

'ఆవిడ కొడుకు మా అన్నయ్యకి స్నేహితుడు. ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేసేవాడు. మంచిజీతం—మనిషి దర్జాగా ఉండేవాడు. చిన్నతనంలోనే తండ్రిపోతే పాపం ఆవిడే కష్టపడి చదువు చెప్పించింది. చాకులా దూసుకుపోగల మనిషి అతను.

చక్కటి ఉద్యోగం మీద ఆధారపడి పెట్టి పోషింపబడవలసిన వాళ్ళెవరూ లేకపోవడం, ఉన్న తల్లికూడా చాలా మంచిది, కష్టజీవి కావడంతో అతనికి పిల్లనిస్తామంటూ చాలా సంబంధాలు వచ్చాయి. బాగా ఉన్నవాళ్ళు కూడా వచ్చారు అతని ఉద్యోగంచూసి. అయితే చిన్నతనంనుంచి బీదరికంలో బతికాడతను. అతనికి అందువలన బీదవాళ్ళపై జాలి. అటువంటి లేనివాళ్ళలో కనీసం ఒక్కరికయినా సాయం చేయాలన్న నిర్ణయానికి వచ్చాడతను.

తల్లికి అతనే దేముడు. అతని నిర్ణయం వేదం. ఫలితంగా ఈ ఊళ్ళో ఒకమ్మాయిని చూశారు. బాగుంది... పెళ్ళిఖర్చులుకూడా పెట్టుకోలేని వాళ్ళు. ఆ సంబంధం నిశ్చయించుకున్నారు సరిగా పెళ్ళిరోజుకి తల్లీకొడుకు వచ్చేశారు. రెండు ప్రక్కల ఖర్చులూ అతనే పెట్టుకున్నాడు పెళ్ళినాటి రాత్రికే తల్లీ, కొడుకు, కోడలు కలిసి వెళ్ళిపోయారు.

అతన్ని ఆదర్శమూర్తి అన్నారు ఇటువంటి వాళ్ళు ప్రతిఇంటా ఉంటే వరకట్న పిశాచి రూపుమాసిపోతుంది అని అందరూ నొక్కి వక్కాణించారు. ఫస్టుక్లాసయిన కుర్రాడు తప్పించుకుపోయాడే అని ఆడపిల్లలు కలవారందరూ వాపోయారు.

నూతన దంపతులు రంగ రంగ వైభవంగా ఉన్నారు. ఆ చిలకా గోరువంకలని చూస్తూ 'పడ్డ కష్టాలు పీడకలలుగా నెమరువేసుకుని నవ్వుకొంటూ కాలం గడిపిస్తోంది ఆవిడ' ఆపాడు వీర్రాజు.

శ్రద్ధగా వింటున్న పద్మావతి తలెత్తి 'ఇంతేనా?' అనడిగింది.

'ఏం బాగాలేదా?' అనడిగాడు.

'ఏముందీ ఇందులో?'

'చూశావా అమ్మడూ, అందరూ సుఖంగా ఉంటే అందులో ఉత్సాహం ఉండదనే జీవితంలో సుఖాలు, కష్టాలు పెట్టాడు దేముడు. చేదు తింటేగాని తీపిలోని తియ్యదనం తెలియదు. చేదు తిని తరువాత తీపి తినేవాళ్ళు అదృష్టవంతులు. అందుకు వ్యతిరేకమయితే భయంకరం!'

వీళ్ళ కేసులో అదే జరిగింది. ఒక్కడే పెరగడంవలన అతనికి పసిపిల్లలమీద వ్యామోహం ఎక్కువయింది. అతని కుటుంబం చిలవలు పలవలు వేసి మహా వంశవృక్షమయిపోవాలని ఆవిడ తాపత్రయం.

విపరీతమయిన వేగంతో ఆరుగురు పిల్లలు పుట్టారతనికి. ఆఫీసులో కొంత బయట కొంత అప్పుచేసి ఇల్లొకటి కట్టాడు. జీవితం తిరగబడింది. చిన్న ప్రమాదంలో కళ్ళు దెబ్బతిన్నాయి. ఉన్న ఉద్యోగం ఊడింది—గవర్నమెంటు కాదు కదా. అతనికి రావలసిన మొత్తం వాళ్ళు ఇంటికిచ్చినదానికిగాను మినహాయించుకున్నారు కంపెనీవారు.

బయట అప్పులు, ఆరుగురు పిల్లలూ—భార్య, తల్లిలతో నిలబడ్డాడతను. కొన్ని రోజులపాటు స్నేహితులు సాయం చేశారు. బంధువులున్నా ఎవరని ఎంతకాలమని సాయం చేయగలరు? 'మమ్మల్ని అడిగి చేసుకున్నారేమిటి పెళ్ళి — 'ఆదర్శాలు' అన్నారు. ఇప్పుడూ వాటిమీదే బతకమనండి' అన్న నెపంమీద దూరంగా ఉండిపోయారు.

అత్తవారి విషయం తెలిసినదే కదా!... పైగా సాయం చేద్దామనుకునేవాళ్ళు కూడా ఏం చేయగలరు—ఒకరా ఇద్దరా — ఆరుగురు పిల్లలు!...సాయం చేసేవాళ్ళు పాతాళానికి వెళ్ళిపోతారు.

అదీ వాళ్ళ స్థితి. అతని కుటుంబభారాన్ని కనీసం ఏడాది ఎవరయినా తీసుకోవాలి. తరువాత పెట్టుబడి పెట్టి అతన్ని మద్రాసు తీసుకువెళ్ళి ఆపరేషన్ చేయించాలి. ఎవరు చేయగలరిదంతా?...ఎవరికేం అవసరం?'

'పాపం మరి ఏమయిపోతారు వాళ్ళు?' అనడిగింది పద్మావతి.

'దేముడు చెప్పాలి. కొడుకుని పెంచిందో అతని పిల్లలని అదేవిధంగా

పెంచవలసిన భారం ఆవిడమీద పడింది. కాకపోతే ఇప్పుడు చేదోడుగా కోడలు ఉంది. అయితే ఇదివరకటి ఓపికుందా ఆవిడకి? ఇదివరకటి ధైర్యం ఉందా? వాడినొక్కడ్ని ఎలాగయినా పెంచితే కష్టాలు గట్టెక్కుతాయని ఆశపడి పట్టుదలతో చేసిందప్పట్లో. ఇప్పుడు ఆరుగుర్ని పెంచాలి.

కొన్నాళ్లు సుఖపడ్డారు. దాన్ని మర్చిపోలేదు ... మరిచిపోలేక తన అసమర్థతని కోపంగా మార్చుకున్నాడతను ... కుమిలిపోతుందనుకో పాపమావిడ !'.

పద్మావతి ఏమీ మాట్లాడలేదు.

నవ్వాడు వీరరాజు 'కళ్లు ముక్కూ ఛిద్రబడి పోయాయప్పుడే. చూసినవాళ్లు వీడిప్పటినుంచే ఆ అమ్మాయిని చీవాట్లేస్తున్నాడులాఉంది. పాపం ఏడుస్తోంది అనుకుంటారు ... కళ్లు తుడుచుకో అమ్మడూ!... మనం గుర్తుంచుకోవలసింది వాళ్ల కష్టాలుకాదు. ఆ కష్టాలు నేర్పే పాఠాలు. అవేమిటో తెలుసా ?'

తెలియదన్నట్లు తలఊపింది పద్మావతి.

'ఆదర్శమెప్పుడూ లోనేమాలిన ధర్మం కాకూడదు నేను చెప్పే ఈ మాటలు ఎవరికీ రుచించక పోవచ్చును. కాని అన్నీ మనం అనుకున్నట్లే అయితే ఇక కావలసిందేముంటుంది ?... కీడునే ఎప్పుడూ శంకించడం మంచిదికాదని నాకూ తెలుసు. అయితే అతి ఆశావాదం ప్రమాదకరం. 'జీవితమే ఒకనాటకరంగం' అన్నాడొక కవి. రాసిన నాటకం మనకు చదివేందుకుంటుంది. అయితే జీవిత నాటకానికి రచయితలం మనంకాము.

కొంచెంగా చెడు జరగవచ్చుననుకుని జీవితం ప్రారంభించామనుకో. అప్పుడు ఖర్మకాలి కష్టాలువస్తే అంతగా బాధపడం ...మల్లెలపాన్పు, ఇంద్రధనుస్సు అనుకుని బయలుదేరితే ఏమాత్రం కష్టానిక్కూడా చావుదెబ్బ తినేస్తాం.

నాకు దరిద్రమంటే భయం.. కేవలం ఉద్యోగంమీద ఆధారపడ్డవాడిని. అయినా నేనిప్పుడు కట్నం తీసుకోలేదు—ఆదర్శమూర్తినే !, అయితే అందులోనూ జాగ్రత్త తీసుకున్నాను. నాకన్న దరిద్రుడి కూతుర్ని కాక ఉన్నవాడి పిల్లనే చేసుకుంటున్నాను. నా అదృష్టం బాగుండక నప్పుడయితే దెబ్బతిన్నాననుకో — నాకు సాయంచేసే మనిషి కనీసం ఒక్కడుంటాడు. నేను కట్నంకూడా తీసుకోలేదు కనుక నామీద ఆయనకు సానుభూతి ఉంటుంది' అన్నాడు వీరరాజు.

పద్మావతి మాట్లాడలేదు.

అతిథులు రావడం కనబడిందతనికి. 'ఇక మనం ముగించాలి. నీతిపాఠం. ఇందులోని నాయకుడు తనకన్న దరిద్రురాల్ని చేరదీశాడు, అది నేరం అనను. అనుకోని మలుపులు జీవితంలో రావచ్చునని ఊహించక పోవడం నేరమంటాను. చిన్న కుటుంబం అయితే ఎవరయినా సాయం చేయగలరు. ఆరుగురు పిల్లల్ని కనడం అతనితప్పు !' అని ఆమె కళ్లల్లోకి చూస్తూ 'అర్థమయింది కదూ !' అనడిగాడు.

'అయింది స్వామీ !' అంది నవ్వుతూ.

'అయితే ఇక లేచి నిలబడు. చేతులు జోడించి చిరునవ్వు ముఖాన అతికించుకో—అతిథి దేముళ్లు వచ్చేశారు.'

'నాతో చేయి కలపవేంరా — నేన్నీకు అతిథిని కానా ?' అన్నాడు సుబ్బారావు.

'శిశుపాలుడు శ్రీకృష్ణుడికి అతిథేమిటోయ్—వాడిని 'సన్మానిద్దాం'అన్నప్పుడు చక్రం విష్ణుచక్రంలా విసరనే విసిరాడుగా! ఇంకా ఆ సీనుకి టైముందిలే... సరే— ఇందాకనుంచి ఈవిడకి సత్యంగారి కథ చెబుతున్నాను. సరిగానే చెప్పానటావా, తప్పులున్నాయా ?'

'సరిగానే చెప్పావు'

'ఓరి నీ దుంపతెగ — వినలేదంటూ ననుకున్నాను. ఎంతధైర్యంరా నీకు ?'

ముగ్గురూ నవ్వుకున్నారు...

'ఇంతకీ నన్ను పరిచయం చేయలేదు మీ ఆవిడకి !'

'వీడు మా అత్తయ్యకొడుకు పద్మా !' కలిసి చదువుకున్నాము వీడి భార్యకూడా మా క్లాస్‌మేట్—లవ్ మారేజి కేసు !'

'సర్లే, ముందు నాపేరేమిటో చెప్పేడు. నిజంగానే శిశుపాలు డనుకుంటుంది ఖర్మ !... నాడమ్మా వీడు కృష్ణుడూ కాదు నేను శిశుపాలుడ్నీ కాను. తెలిసిందా! నాపేరు సుబ్బారావు.'

'నేను కృష్ణుడ్నయితే నీకేం బాధరా?' నవ్వుతూ అడిగాడు వీరరాజు.

'నాకేం బాధ, ఆ అమ్మాయికి ఉండాలి బాధంతా — పదహారువేల మందయ్యే ఖర్మ !'

నవ్వేసింది పద్మావతి.

'రెండు నీతిపాఠాలు వినిపించావావిడకి. ఇంకా ఎన్ని మిగిలాయో ?' అడిగాడు సుబ్బారావు.

'కోర్సు అయిపోయింది. ఇక ఎడ్యుకేషనల్ టూర్ ఉంది.'

'అదెక్కడికో ?'

'నీ అంతవాడుండగా ఇంకా ఎక్కడికో ఏం ఖర్మరా— మీ ఇంటికే !'

'అయ్య బాబోయ్, మా ఇల్లు అంత ప్రాముఖ్యత పొందిందేమిటా ? లవ్ మారేజి చేసుకున్నంత మాత్రాన అంత ఆదర్శప్రాయులమయి పోయామా? ఆల్ రైట్



# సఖికి సలహాలు

కొంచెం వబ్బిసిటీ ఇచ్చావంటే మా ఇల్లొక టూరిస్టు సెంటరవుతుంది. హాయిగా ఉద్యోగం మానేసి వచ్చినవాళ్ళకి 'గైడ్'గా బోలెడు సంపాయించవచ్చు. పుణ్యముంటుంది ఆపని చెయ్'

'గైడ్'గా ఉంటానంటే మీ ఆవిడ డొక్క చీరేస్తుంది'.

'ఎందుకో?'

'సినిమా చూసిందిగా—నువ్వు కూడా వివతెనయిరా చేరదీస్తే?'

'వెధవ జోకు వేయకొరేయ్, ఎప్పుడొస్తారో చెప్పండి — తోరణాలు కట్టించి ఇంటికి బంగారు మలామా చేయించుతాను'

'చెప్తా చెప్తా, నువ్వు ముందు తప్పుకో. వెనక వేలాది జనం వచ్చేస్తున్నారు' అని పద్మావతితో 'మూడు నిద్రలకి మా ఊరు వెళ్ళినప్పుడు తీసుకు వెడతాను మా అత్తయ్యగారింటికి కాని ఆవిడ కొంచెం తొందరగా మాట్లాడుతుంది జాగ్రత్త' అన్నాడు మెల్లిగా.

ఇద్దరూ ఎచ్చే జనానికి చేతులు జోడించి నిలబడ్డారు...

* * *

'చెప్పిన ప్రకారం తీసుకొచ్చాను చూశావా అత్తయ్యా!' అన్నాడు రిక్షా దిగుతూనే వీర్రాజు.

పద్మావతి సందేహిస్తూ రిక్షా దగ్గర నిలబడిపోవడం చూసి మళ్ళా వెనక్కి వెళ్ళి 'భలేదానివే, కొట్టదులే — రా! తన కూతుర్ని చేసుకోనందుకు అత్తయ్యకి నా మీద కోపం. అది నీ మీదికి తిరగవచ్చు. మనిషి మాత్రం మంచిదే' అని మెల్లగా చెప్పి చేయిపుచ్చుకుని లోపలికి తీసుకు వచ్చాడు.

'మీ ఆవిడకి దృష్టిదోషం ఉందా ఏమిటా వీర్రాజూ?'

'అదేమిటత్తయ్యా అలా అడిగావు?'

'వెనక్కి వెళ్ళి చేయిపుచ్చుకు నడిపిస్తుంటే అనుమానం వచ్చిందిలే' అంది నవ్వుతూనే.

'గుమ్మంలో పులిలా నిన్ను చూసి బెదిరుంటుందిలే!...సుబ్బిగాడేడీ?' అన్నాడు మాట మారుద్దామని. కాని ఆవిడ వేయ వలసిన బాణం ఇంకా బయటపడలేదని అతనికి తెలుసు!

అంతలోనే ఆవిడ కూతురు సరోజ వరండాలోకి రావడంతో అతను భయపడిన పని జరగనే జరిగింది. ఒకసారి తన కూతురి వంక పద్మావతి వంక చూసి నవ్వి 'తెలియకడుగుతాను గానొరేయ్ వీర్రాజూ, నా కూతుర్ని చేసుకోనన్నావాడివి దానికన్న అందమయినదాన్ని చేసుకున్నావంటే సంతోషించేదాన్ని. ఇదేం పనిరా?' అనడిగిందావిడ.

వీర్రాజుకి కోపం వచ్చేసింది. కాని పద్మ అతని చెయి గిల్లింది ఊరుకోమన్నట్టు. తరువాత మెల్లిగా వరండాలో సరోజ దగ్గరకు వెళ్ళి 'మీ అమ్మాయిలాంటి దాన్ని కళ్ళకద్దుకుని ఎవరయినా చేసుకుంటారు పిన్నిగారు, కాని నాలాంటి వాళ్ళని చేసుకునేందుకూడా ఎవరయినా ఉండాలికదా! అది ఈయన వంతయింది!' అంది నవ్వుతూ.

ఆవిడ అవాక్కయి పోయింది.

నన్ను మావాళ్ళు ఎరుపంటారు. కాని మీ రంగు ముందు నేనెలా ఉన్నానో' అంది సరోజను చూస్తూ పద్మావతి.

అప్పటికి తెప్పరిల్లింది ఆ అమ్మాయి. 'ఛ, ఛ భలేదానివే! నీ నాజూకుతనం ముందు నేనెంత? అమ్మతీరే అంత— పట్టించుకోకు' అంది.

వీర్రాజు ధైర్యంగా కుర్చీలో కూర్చున్నాడు, 'మావయ్యేరత్తయ్యా?' అనడిగాడు.

'బజారు కెళ్ళినట్టున్నారరా. సరోజా, బావకి, అమ్మాయికి కాఫీ కలుపుకురా... నెమ్మదయినదాన్నే చేసుకున్నావులే'

'సుబ్బారావు ఏడీ?'

నిట్టూర్చిందావిడ. 'వాడి విషయం తెలియాలంటే వాడి భార్య ఎక్కడుందో కనుక్కోవాలి ముందు. దానిపక్కనే ఉంటాడు వాడు!'

నవ్వాడు వీర్రాజు.

'నవ్వుతావేంరా, నీకలాగే ఉంటుందిలే. మీరంతా ఒకటేగా!'

'భలేదానివత్తయ్యా...ఏం కొత్త'

'అవునవును అందరూ ఇలాగే ఉంటున్నారా?...నా ఖర్మ!...అదుగో ఊరేగడం అయినట్టుంది—చేరుకుంటున్నారు చూడు'

సుబ్బారావు భార్య శశిరేఖ లోపలికి వస్తూనే 'హల్లో వీర్రాజూ! మీ ఆవిడని కూడా తెచ్చావా ఒక్కడివే వచ్చావా?' అనడిగింది.

'ఏం ఒక్కడినే అయితే రానీయరా ఏమిటి?'

'నిజంగాను!... ఏదీ లోపలుందా, ఏమండీ!' అంటూ గబగబ లోపలికి వెళ్ళిపోయింది.

'తెల్లబోకు. ఆ 'ఏమండి' నేనన్న మాట!...'అత్తగారూ' అనదుగా.'

రిక్షావాడికి డబ్బులిచ్చి లోపలికివచ్చిన సుబ్బారావు 'ఏరా రాజూ, రారా, కబుర్లు చెప్పుకుందాం' అంటూనే గదిలోకి వెళ్ళిపోయాడు.

'అదిరా వరస! గూట్లోంచి బయటికి, బయటనుంచి నేరుగా గూట్లోకి! చిలకా గోరింకా అనిపించుకోవాలని!' నవ్విందావిడ.

వీర్రాజు కూడా నవ్వేశాడావిడ మాటకి.

'మీకు నవ్వులాటగనే ఉంటుందిరా అబ్బి, పెదవాళ్ళం మాకూ కోరికలుంటాయి కదా! ఇంటికి పెద్దకోడలిది. చక్కగా 'అత్తయ్యా' అని పిలుస్తుందన్న ఆశ, పిలవాలన్న కోరికా నాకూ ఉంటుందిగ!...ఎంతెంత వాళ్ళని పేర్లు పెట్టి పిలుస్తుంది గాని బంధుత్వాలు లేవు దానికి! నిన్న చూడరాదూ 'వీర్రాజూ' అనేసింది. 'అన్నయ్యగారూ' అంటే ఎంత నిండు?'

'అదేమిటత్తయ్యా, నేనూ, శశిరేఖా, సుబ్బారావు కలిసి చదువుకున్నాం తెలుసుగా! ఇంచు మించు నా ఈడుది'

'నీ ఈడేం ఖర్మ...నా ఈడుంది'

నవ్వాడు వీర్రాజు.

'పోని, కట్టుకున్నవాడు కదా! అందరినీ ఒప్పించి కష్టపడి ప్రేమించి పెళ్ళాడాడు కదా—వాడికేం గౌరవం ఉంచింది? 'సుబ్బారావు' అంటుంది ... మరుదుల్ని అందర్ని పేరుతోనే పిలవడం!'

'భలేదానివత్తయ్యా, మరుదుల్ని ఇంకేం పిలవమంటావు? చిన్నవాళ్ళు కదా!'.

'ఆఁ, పెద్దవాళ్ళం మా గౌరవం ఏముంచిందిలే! 'ఏమండి' అంటుంది—అక్కడికే ఆనందం 'మంగమ్మా' అనకుండా' అని నవ్వి 'ఎప్పుడో వాళ్ళ మావగారిని 'చలపతిరావు' అని పిలిచేస్తుందది!' అంది.

ఇక లాభం లేదనుకుని ఒక నవ్వు నవ్వి

సుబ్బారావుతో మాట్లాడి వస్తాను' అని లేచి లోపలికి పోయాడు వీరరాజు.

శశిరేఖ, పద్మావతి కాఫీలు తీసుకుని లోపలికి వచ్చారు. 'మీ ఆవిడకి సిగ్గు బాగా నేర్పినట్టున్నావ్ వీరరాజూ. 'కాఫీలు తీసుకుని గదిలోకి రావోయ్' అంటే 'ఎందుకండీ, వంటింట్లోనే కూర్చుందా'మంటోంది...కాఫీ తీసుకో' అంది శశిరేఖ.

కాఫీలు తాగుతూ మెల్లిగా అన్నాడు 'అవునూ, నువ్వేమిటి మా అత్తయ్యని 'ఏమండీ' అంటావుట! 'అత్తగారూ' అని పిలుచుకోవాలని ఆవిడకి సరదా! అనరాదూ—బాగుంటుంది కూడా!' అన్నాడు వీరరాజు.

శశిరేఖ అతని వంక చూసి నవ్వి 'అయిందీ, నీకూ ఒచ్చిందన్నమాట కంప్లెయింటు!...అవునూ, నువ్వాయన్ని ఏమని పిలుస్తావు.'

''ఏరా' అని.'

'అఫ్‌కోర్స్, మీరు బంధువులు కదూ! సరే...నువ్వు 'ఏరా' అనే స్నేహితులు కాలేజీలో ఎంతమంది ఉండేవారు?'

'కొద్దిమంది—అయిదుగురు.'

'వాళ్ళయినా నీతో స్కూల్లో చదువుకున్నవాళ్ళు. అవునా?'

ఆలోచించి 'అవును' అన్నాడు వీరరాజు.

'కరెక్ట్. కాలేజీలో పరిచయం అయిన వాళ్ళంతా 'ఏమండి' లేక మాగ్జిమమ్ 'ఏవోయ్'తో ఆగిపోయినవాళ్ళే కదూ!'

'అవును!'

నవ్వింది శశిరేఖ. 'ఎందువలన? నీతో చిన్నతనంనుంచి చదివినవాళ్ళని నువ్వు 'ఏరా' అనగలిగావు. ఒక వయసు వచ్చేశాక పరిచయం అయినవాళ్ళు కాలేజి స్నేహితులు. వాళ్ళని 'ఏరా' అనలేకపోయావు...అవునా?'

నవ్వాడు వీరరాజు 'నువ్వు లాయరవ్వాలిసింది...నువ్వు చెప్పింది రైటే!'

'అలాగే ఒక వయస్సు వచ్చాక ఏర్పడే ఈ బంధువులని కూడా చనువుతో పిలవలేం. దానికి కొంత టైం పడుతుంది. పరిచయం పెరగాలి. ముఖ్యంగా బంధుత్వం నుంచి స్నేహం, ఆత్మీయతా రావాలి. అప్పుడు 'అత్తగారూ' కాదు 'అత్తయ్యా' అనమన్నా అనగలం.'

'అవుననుకో. అయినా నీచేత అలా అనిపించుకోవాలని ఆవిడ సరదా, అంటే ఏం పోయింది?'

'ఆత్మవంచనవుతుంది.'

'రేపు రాబోయే కోడళ్ళు కూడా నిన్ను చూసి అలాగే పిలుస్తారని ఆవిడ భయం!'

'అందరూ నాలాంటి వాళ్ళే ఎందుకుంటారు? చూద్దాం ఆవిడ అదృష్టం.'

పద్మ వంక చూసి నవ్వాడు వీరరాజు.

కప్పులు తీసుకుని లోపలికి వెళ్ళింది శశిరేఖ.

'ఇదిగో నువ్వు మా ఇంట్లో మీ ఆవిడకి నేర్పేపాఠం?' అనడిగాడు సుబ్బారావు.

'కరెక్ట్!'

'ఏడిశావు. మా అమ్మ గోల విన్నావు! దీని మొండితనం విన్నావు!... నేను చెప్పినా వినదు. నన్నే 'సుబ్బారావు' అంటుంది. ఏమిటి చెప్పేది ఖర్మ! ఇటువంటిగోల నీ ఇంట్లోకూడా ఎందుకుట?'

నవ్వేశాడు వీరరాజు 'ఉండకూడదనే ఇక్కడికి తెచ్చింది. ఇది మంచి కాదని చూపించేందుకు. ఈవిడకూడా చదువుకున్న చదువుని సద్వినియోగం చేసుకోదేమోనని నా భయం.'

రిక్షాలో పద్మావతితో 'అయిపోయిందోయ్' నేను చెప్పదలుచుకున్నదీ, చూపించదలుచుకున్నదీను ... మా అత్తయ్యలాంటి మనసే అందరు అత్తగార్లదీనూ!' అన్నాడు వీరరాజు.

నవ్వింది పద్మ 'ఇదే మీ ఉద్దేశ్యమయితే ఇక్కడికి నన్ననవసరంగా తెచ్చారు. అత్తయ్య నడిగితే ఆవిడ చెప్పేది నేనేమంటున్నదీను!'

'దట్స్‌గుడ్ మరి మిగిలినవి?'

'అన్నీ గ్రహించాం'

'థాంక్స్ మాడమ్...రాయనా రిక్షావాడూ సినిమాహాలుకి పోనీయవోయ్ రిక్షాని' అన్నాడు పెద్దగా.

'ఏ హాలుకండి?' అనడిగాడు వాడు.

'నీ ఇష్టంవచ్చిన దానికి ... నీ కే ది బాగుంటే దానికి' పద్మావతి నవ్వింది. వీరరాజూ నవ్వాడు...

రిక్షా వేగం అందుకుంది. ●





✷ సుబ్రహ్మణ్యానికి అర్ధరాత్రి ఓ వెధవ కలొచ్చింది. అందులో అతగాడు తన పెళ్ళాన్ని గుంటూరు జనరల్ ఆసుపత్రిలో జేర్చాడట. ఆవిడగారు అందులోనే వుండి తీసుకు తీసుకు చచ్చిందిట! ఆ అర్ధరాత్రి పూట భయంతో లేచి కూర్చున్నాడు. గదంతా చీకటిగా వున్నది. ఒక పక్కంతా పడివున్న పుస్తకాల దొంతర్లు, మరోవైపున నీళ్ళ బిందె, దానిపక్కన స్టౌ... వాటిమీదగా హేవార్డ్స్ వాళ్ళ క్యాలెండరు — అందులో తెల్లని పలువరుసతో నగ్నంగావున్న సుందరి!

చుట్టూ అయోమయంగా కళ్ళు నులుముకుంటూ చూచాడు సుబ్రహ్మణ్యం. ఎంత కళ్ళు నులుముకున్నా అతడికి కనబడుతున్నది తన గదే! చాలాసేపటివరకూ అలా ఆశ్చర్యపోతూనే కూర్చున్నాడు. తనకు పెళ్ళేమిటి...ఆమెకు జబ్బుచేయటమేమిటి... గుంటూరు జనరల్ ఆసుపత్రిలో చచ్చిపోవటమేమిటి— అతడికి ఏమాత్రం అంతుపట్టలేదు.

చాలాసేపటికి అతనికి గుర్తుకొచ్చింది— చెడు కలలెప్పుడూ మంచి చేస్తాయ్యని! అంటే తనకు త్వరలోనే పెళ్ళి అవ్వబోతున్నదా అనిపించింది. అలా అనిపించటం అతడికి హాయిగానే వున్నది. అప్పుడు ఈ బ్రహ్మచారి మఠాన్ని పీకేయొచ్చు... అంతేగాదు యిలా క్యాలెండర్లలో బొమ్మలవంక చూస్తూ కూర్చోవాల్సిన అవసరమూ తప్పుతుంది.

ఇక తనకు పెళ్ళి అయ్యే సూచనలు కనబడుతున్నాయి అని అనుకునేటప్పటికి అతడికి మళ్ళీ నిద్ర ముంచుకొచ్చింది. తిరిగి తెల్లవారింతరువాత లేచేటప్పటికే సూర్యుడు పైకి బారెడుదూరం జరా జరా పాకేశాడు.

వళ్ళు విరుచుకుంటూ లేచాడు. హేవార్డ్స్ వారి ధర్మం కళ్ళకు ఉపశాంతి కలిగించింది.

ఆ బొమ్మను తనివితీరా చూసుకొని, బ్రష్ మీద పేస్టు ఎక్కించి దొడ్లో టాప్‌వద్దకు బయల్దేరాడు.

టాప్ తిప్పి నోట్లో ఓ గుక్కెడు నీళ్ళు పోసుకోగానే కిలాకిలా రావాలు వినబడ్డాయి. కొత్తగా వినబడ్డ ఆ నవ్వులకు ఆసక్తిగా వెనుదిరిగాడు — నోట్లో ఉమ్మేయాల్సిన నీళ్ళు అట్లాగే ఉన్నాయి.

అక్కడో పడుచుపిల్ల నవ్వుతూ కనబడింది. లోపలున్న ఎవ్వరితోటో నవ్వుతూ ఏదో చెబుతోంది. తనని చూసినట్లు లేదు.

ఆ అమ్మాయి మొఖం చూస్తూనే లిప్త కాలం సుబ్రమణ్యం అవాక్కయ్యాడు.

— రాత్రి తన భార్య అయి గుంటూరు ఆసుపత్రిలో చచ్చిన మనిషికీ ఈ అమ్మాయికీ చాలా దగ్గర పోలికలున్నట్లనిపించింది, అందుకే విచిత్రంగా, సినిమాకు ముందుగా వేసే స్లైడ్‌లో బొమ్మలాగా సగం వంగొని, నోట్లో పుక్కిట పట్టివుంచిన నీళ్ళను అలాగే వుంచి, రెండు గుడ్లూ ఆ అమ్మాయికే అప్పగించి నిలబడి పోయాడు.

ఆ అమ్మాయి తరువాత కొద్దిసేపటికే మొఖం పక్కకు తిప్పి అతగాడు నిల్చున్న తీరును చూచి, ఎవరా ఈ కోతి అనుకుంటూ ఫక్కున నవ్వి లోపలికి వెళ్ళిపోయింది.

— అప్పటికిగాని మళ్ళీ సుబ్రమణ్యానికి తెలివి రాలేదు.

తెలివి వచ్చిన తరువాత గుర్తుకు తెచ్చుకున్న విషయాలేమిటంటే— తన గది పక్క భాగంలోకి నిన్న ఇంటాయన కొత్తగా అద్దెకొస్తారని చెప్పినట్లుగా వచ్చినవాళ్ళు, వాళ్ళు— ఆ కమలంవాళ్ళుతాలూకు మనిషి!

చాలా విచిత్రంగా అనిపించింది — ఈ రోజు ఉదయంవరకూ చూడని ఆ అమ్మాయి రాత్రి కలలో కనబడ్డందుకు! త్వరత్వరగా మొఖం కడుక్కొని తన గదిలోకి వెళ్ళిపోయాడు.

లోపలికి వెళ్ళి తువ్వాలుతో తడి మొఖం తుడుచుకుంటూ రోజులాగా హెవార్డ్‌వారి క్యాలెండర్‌వంక చూస్తుంటే — ఆ కమలం ముందు ఈ బొమ్మ తీసికట్టే అనిపించింది. వెంటనే దాన్ని చుట్ట చుట్టేసి పెట్లో అడుగున పెట్టేశాడు.

— వాళ్ళెవరన్నా తన గదిలోకి వచ్చి ఆ బొమ్మను చూస్తే బాగుండదనుకున్నాడు!

* * *

మధ్యాహ్నం పడుకొని నిద్రపోతుంటే తలుపు దడదడా మ్రోతయింది. ఊరికేనే మ్రోతయితే సుబ్రమణ్యానికి మెలుకువ వచ్చేదిగాదు. ఓ ఆడకూతురు పిలుపుగూడా వినబడింది. అందుకే అయస్కాంతంలా తలుపుదగ్గరకు పరుగెత్తి ఘడియతీశాడు.

ఎదురుగ్గా కమలం.

'హిహిహ...' అన్నాడు జిడ్డుకారుతున్న మొఖంతో ఏం చేయాలో తెలియక.

'మీకు టెలిగ్రాం వచ్చిందండీ!' అన్నది ఆ అమ్మాయి టెలిగ్రాం అందిస్తూ.

'నాకా?' అన్నాడు ఆశ్చర్యంగా, ఆదు

న్నాడు సుబ్రహ్మణ్యం.
'అవును, మీకే ... ఇందాక మెసెంజర్ వింత తలుపు కొట్టినా తీయకపోతే నా కిచ్చి వెళ్ళాడు!' అన్నది.
పేయి వణుకుతుండగా, టెలిగ్రాం చించి అలాగే చూస్తూ వుండిపోయాడు.
'ఫాదర్ ఎక్స్‌పైర్‌డ్...స్టార్ట్...
— రామం'
అలాగే నిర్విణ్ణుడై నిలబడిపోయాడు సుబ్రహ్మణ్యం.
అతడి వాలకం చూచి కమలం, 'ఏదేం జరగలేదుగదా!' అన్నది ఆదుర్దాగా.
'ఫాదర్ ఎక్స్‌పైర్‌డ్...స్టార్ట్ - రామం' తిరిగి చదివాడు మగతగా.
'అరెరె...' అన్నది బాధపడుతున్నట్టుగా కమలం.
'అదిగాదండి — మా ఫాదర్ పదేళ్ళ క్రిందటే ఎక్స్‌పైర్‌డ్ అండి!' అన్నాడు అమాయకంగా మొఖం పెట్టి సుబ్రహ్మణ్యం.
'ఇదేమిటి?... అతడికి ఆ షాక్‌కి మతి భ్రమణంగాని జరగలేదుగదా?' అనుకున్నది మనస్సులో కమలం.
కవరుమీద పేరు చూచాడు. తన పేరే వున్నది. వీధి పేరు చూచాడు. తన వీధి పేరే వున్నది. అయితే ఆ టెలిగ్రాం ఎవ్వరికైతే యివ్వాలో వారి ఇంటి పేరు లేదు. ఇంటి నెంబరూ లేదు.
'నాలుగు పైసలకోసం కక్కుర్తి పడితే దక్కే ఫలితం ఇదండీ!' అన్నాడు తనగది తలుపుమీద వున్న తన పేరును చూచుకుంటూ.
'అంటే ఈ వీధిలోనే మరో సుబ్రహ్మణ్యంగారు ఉన్నారన్నమాట!' అన్నది కమలం.
'అవునండీ!'
'ఇప్పుడేం చేస్తామండీ?' అన్నది చేసిన తప్పుకు పశ్చాత్తాప పడుతున్నట్టుగా — దిగులుగా.
'కాసేపు నేను టెలిగ్రాం మెసెంజర్ నవుతాను!' అన్నాడు నవ్వి సుబ్రహ్మణ్యం.
'మీకు శ్రమ కలిగించినందుకు క్షమించాలి!'
'ఎంత మాట ... ఇందులో క్షేమం వున్నది!' అన్నాడు వెనుదిరుగుతూ.
కమలం వెళ్ళిపోయింది.

* * *

# కలల్లో కమలం

'ఇంతకీ ఆ సుబ్రహ్మణ్యం ఎవరో దొరికారా?' అన్నది లోపలికి వస్తుండగానే కమలం — గేటుదగ్గర సుబ్రహ్మణ్యం కోసమే ఎదురుచూస్తున్నట్టుగా నిల్చొని.
'నా ఖర్మకొద్దీ తండ్రి లేని మరో సుబ్రహ్మణ్యం గూడా మన వీధిలోనే వున్నాడండీ!' అన్నాడు సుబ్రహ్మణ్యం నవ్వి.
'మరేం చేశారు అప్పుడు?'
'తండ్రుల్లేని మేమిద్దరం తండ్రి వున్న సుబ్రహ్మణ్యంకోసరం ఈ వీధి వీధంతా గాలించేసి — అతగాడిని పట్టుకునేటప్పటికి తల్ప్రాణాలు తోకకు వచ్చేసినయ్!'
కమలం — ఇతగాడికి తోకగానిఉందేమో నన్నంత భయంగా ఒక్క క్షణం సుబ్రహ్మణ్యం వెనక్కు ఒక్కసారి చూచి మళ్ళీ మొఖంమీదకు చూపులు మరల్చింది.
'ఇది మరీ బాగుంది — ఆ సుబ్రహ్మణ్యం మాష్టారు ఆ టెలిగ్రాం చూస్తూనే మా యిద్దరినీ కావలించుకొని ఏడ్వడం మొదలుపెట్టాడు!' అన్నాడు ఫక్కున నవ్వి.
'చిన్నవాడేనటనా?'
'ఆఁ...తొంభై ఏళ్ళమిదట — స్వర్గానికి వెళ్ళివుంటాడు, పుణ్యాత్ముడు!' అన్నాడు తన గది మెట్లెక్కుతూ.
'ఎక్కడికీ వెళ్ళబోకండి ... రెండు నిముషాల్లో కాఫీ కలుపుకొచ్చేస్తాను ... అనవసరంగా మీకు శ్రమ యిచ్చినందుకు ప్రాయశ్చిత్తమన్నమాట అది!' అని చెప్పుకుంటూ లోపలకు వెళ్ళిపోయింది కమలం.

* * *

సుబ్రహ్మణ్యానికి ఆ రాత్రి ఇంకో కల వచ్చింది. తనూ, కమలం కలిసి ఒకే రిక్షాలో ఎక్కడికో వెళుతున్నారట. టాపువేసిన రిక్షాలో కూర్చున్న కమలం తన కళ్ళల్లో కళ్ళుపెట్టి చూచి నవ్వుతున్నదట. తనూ నవ్వాడట. వెంటనే ఆమె రిక్షా ఆపించి తను దిగి, తనను దిగమని 'పరాయి ఆడదాన్నిచూచి నవ్వుతావా' అంటూ ఆ చెంపా ఈ చెంపా ఎడాపెడా వాయించిందట!
బ్రహ్మచారి మఠంలో చెంపలు తడుముకుంటూ మంచంమీద లేచి కూర్చున్నాడు సుబ్రహ్మణ్యం.
ఇద్దరూ ఒకే రిక్షాలో వెళుతున్నారు. కమలం తనను చూస్తూ నవ్వినమాట నిజం...దానికి సమాధానంగా తను నవ్వితే ఆవిడగారు రిక్షా దిగట్లా ఎందుకు కొట్టాలిట?
ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.
నిజమే— ఆడదాని మనస్సు అర్థం చేసుకోవటం అంత సులభంకాదు సుమీ— అనుకున్నాడు సుబ్రహ్మణ్యం.
మళ్ళీ తెల్లవారిందాకా అతడికి నిద్ర పట్టలేదు. చెంపమీద చేతిని తీసుకోలేదు.

# ఓం నమః శివాయః

కం॥ అకరకాల జన్మం బొద్దన్న
ఆ రారాజులేలే రాజ్యముల నిలన్
ఆకన్నైన నీలో మందు
అతి నీతి నిర్వారా, రావే
రక్షింపగన్॥

కం॥ ఋగ్, యజుర్, సామవేద
అవాకలున్న నరులు నీతులు
నిర్వర్తించరయ్యా
అహాన్ని తిరస్కరింతురు
అహాన్న వీక్షణతో వలతురే
వనితలన్॥

కం॥ రెక్కలు లేని పక్షి నైతిన్
ఆ వుందునో లేదో నా భాగ్యం నీది
ఆ తులంటే నాకిష్టమన్న
ఆ ముద్దు, సొమ్ములొద్దు,
నీ నామ సంకీర్తనతే॥

కం॥ ఆషమేల, దుఃఖమేల
ఆతుడవు, శంభుడవు, సరస్వతీ
రక్షకుడున్
అందరికి నందుదుపు
అహారా మంగళంబిత్తు ఓం
నమఃశివాయ సిద్ధంనమః.

సంక్షిప్త సేవాయ నమఃశివాయ
రక్షణ రక్షితాయ నమఃశివాయ
స్వతంత్ర సిద్ధేశాయ నమఃశివాయ
తిరస్కార నాశాయ నమఃశివాయ
గింకార కారణాయ నమఃశివాయ
రీతి మాలాయ నమఃశివాయ.

(అయిపోయింది)

రచయిత్రి : శ్రీమతి సరస్వతిగిరి

అలాగే మోకాళ్ళమధ్య తలనుపెట్టుకు కూర్చున్నాడు.

తెల్లవారుతుండగానే టాప్ దగ్గరకు వెళ్ళాడు మొఖం కడుక్కునేందుకు—కమలం కనబడితే చూసేటందుకు.

కమలం కనబడలేదుగాని — కమలం తండ్రి కనబడ్డాడు.

ఆయన సుబ్రమణ్యాన్ని చూసి నవ్వుతూనే, 'నిన్న మా అమ్మాయి మీకేదో పెద్దపని తగిలించిందట!' అన్నాడు.

సుబ్రమణ్యం, 'హిహిహి...'అని నవ్వేసి ఊరుకున్నాడు

'నాన్నోయ్...దానికిగాను ఒక కప్పు మంచి కాఫీ కలిపేసి ఇచ్చేశాను...మళ్ళా క్షమాపణలు అనవసరంగా చెప్పేసేవ్!' అన్నది లోపలినుంచే.

నవ్వాడు కమలం తండ్రి.

'ఒసేయ్ సుశీలా!...ఇలా బయటకురా!' అన్నాడు వంటగదివైపుకు తిరిగి

'హమ్మయ్య!' అన్నాడు సుబ్రమణ్యం అనుకోకుండా 'ఇప్పటికిగాని ఆ కమలం పేరు తెలియలేదు!'

అతడు 'హమ్మయ్య' అంటుండగానే సుశీల బయటకు వచ్చింది.

'ఏమైంది?' అన్నది.

'దేనికి?' అన్నాడు సుబ్రమణ్యం.

'మీరు ఇప్పుడు 'హమ్మయ్య' అన్నారు గదా...

గతుక్కుమన్నాడు సుబ్రమణ్యం.

'అబ్బెబ్బే!' అన్నాడు నసుగుతూ. 'ఛ ఛ! అనవసరంగా నాలికజారి పెద్దగా అన్నాడు — చూస్తే అసలు సంగతి కనుక్కొని చెంపలు వాయించేలా వున్నది— అందునా రాత్రి కల్లో ..

'నేను చెప్పానుగదా ... ఇదండీ మా అమ్మాయి – బంక, జీడి...పట్టుకుంటే వదలదు ... చెప్పు నాయనా ... ఎందుకు 'హమ్మయ్య' అన్నావో వెంటనే చెప్పేశేయ్!' ఆయన నవ్వుతూ నడుంమీద చేతుల పెట్టుకు నిల్చున్నాడు

'ఊఁ... చెప్పేసేయండి!' అన్నది మరో అడుగు ముందుకువేసి సుశీల — వంట చేస్తున్నదల్లా వచ్చిందేమో చేతిలో గరిట గూడా వున్నది.

'ఏమీలేదండీ... ఊరికినే నోరు జారాను!' అన్నాడు గుండె తధికిణతోం అంటుండగా.

'ఊరికే ఎందుకంటారు... ఏదో రిలీఫ్ దొరినప్పుడే 'హమ్మయ్య' అంటావిక

# కలల్లో కమలం

పిలుస్తున్నది — కనుక మీరు పొందిన రిలీఫ్ ఏమిటో వెంటనే చెప్పేసినా సరే — లేదంటారా ఈ పూట నా చేతివంట రుచి చూసినా సరే...'

'రెండో దానికే 'జై' కొట్టండీ మాష్టారూ...' అన్నాడు సుశీల తండ్రి.

'ఇవాళ మా ఫ్రెండూ వాళ్ళనాన్న పుట్టిన రోజటండీ... అందుకని' ఏదో ఓ చవట అబద్ధం ఆడదాం అనుకున్నాడు.

'—అందుకని మీరు 'హమ్మయ్య' అన్నారా?' సుశీల ఫక్కున నవ్వింది.

సుశీల తండ్రీ నవ్వుతున్నాడు.

మొఖం కందగడ్డలా చేసుకొని గదిలోకి వచ్చేశాడు సుబ్రమణ్యం మొఖంగూడా కడుక్కోకుండా!

* *

లోపల తూము దగ్గరే కూర్చొని పళ్ళు బ్రష్ చేసుకుంటుంటే సుశీల తండ్రి, 'రావచ్చా అండీ!' అంటూనే లోపలికి వచ్చేశాడు.

ఎలాగూ లోపలికి వచ్చాడుగదా అని సుబ్రమణ్యం ఇంకేం మాట్లాడలేదు.

'నాకొక్కతే కూతురు ... తల్లిలేనిదాన్ని అన్నీ నేనే అయి పెంచాను!'

'తనకెందుకవన్నీ!' అనుకున్నాడు సుబ్రమణ్యం ఇంకా కోపంగానే.

'... అది కాస్త చిలిపిది... మీ మనస్సు కేమైనా కష్టం కలిగిస్తే దాని బదులుగా నన్ను క్షమించండి... అది బి. ఏ. ఫస్టు క్లాసులో పాసయింది తెలుసా!'

'ఏక్లాసులో పాసయితే ఎవడిక్కావాలి... బోడి క్లాసు — మేనర్స్ లేనప్పుడు!' అనుకున్నాడు కసిగా.

'నేను చెబుతున్నది మీ కర్థమవుతున్నది గదా —మీరు మా అమ్మాయి చెప్పినట్టుగా మా యింటికి భోజనానికి రావాలి!'

'ఇవాళ హోటల్లో స్పెషల్ అండి — వెళ్ళకపోతే నాకు నష్టం... మా ప్రొప్రయిటర్ గాడికి లాభమూ— ఎలా చెప్పండి" అని చెప్దామనుకున్నాడు — కాస్త కోపాన్ని కనుమరుగుచేసుకో ప్రయత్నిస్తూ.

'మీరు రాకపోయారో— ఈ పూట నాకూ మీతోపాటే హోటల్ భోజనప్రాప్తి!'

సుబ్రమణ్యం తేలిగ్గా నవ్వాడు: 'వెల్‌కమ్!'

'ఆ బోర్డేదో మా వాకిట్లోనే తగిలించేస్తాను ... మీరే మాయింటికి వచ్చేయండి, మహాశయా!' ఆయన మరో మాటకు అవకాశం యివ్వకుండానే వెళ్ళిపోయాడు.

* * *

శుక్రవారం రాత్రి మళ్ళా కమలం కల్లో కనబడింది.

తను భోజనం చేస్తున్నాడట, పీట మీద కూర్చొని తల వంచుకొని, ఎదురుగ్గా తలెత్తుకు కూర్చున్న కమలం మజ్జిగ పులుసు గిన్నెలో గరిటె తిప్పుతూ ఏదో చెబుతూ నవ్వుతున్నదట...

ఇంతలోకే ఎక్కడనుంచో భీకర గర్జనలు వినబడసాగినయి ... 'దాక్కో ... దాక్కో' అంటున్న కమలం...మా నాన్న వస్తున్నాడు .. దాక్కో... ఆయన నరమాంసం తింటున్నాడు...అని గూడా అన్నదట...

తను భయంతో ఒణికిపోతూ బల్లిలా గోడకు అంటుకుపోయాడట...

మెలకువ వచ్చింది.

తను మంచానికి కరుచుకు పడుకున్నాడు.

సుశీల నాన్న గుర్తుకు వస్తే చికాకు వేసింది. మొర్నాడు సాయంత్రం దాకా అలా చికాకుపడుతునే వున్నాడు సుబ్రమణ్యం.

ఆ చికాకుతోనే మెకన్సగోల్డ్ అన్నా చూద్దామని రామకృష్ణకు వెళితే — అక్కడున్న పెద్ద క్యూ త్రాచుపాములా మీద మీద కొచ్చింది.

బిక్క మొఖం వేసుకొని చూస్తూ నిల్చున్నాడు.

అప్పుడే సుశీల ప్రత్యక్షమయింది.

భయం భయంగా చుట్టు ప్రక్కల చూశాడు. ఆవిడగారి నాన్న రాక్షసుడు ఎక్కడా కనబడలేదు.

'హమ్మయ్య' అనుకుందామనుకొని మళ్ళా అదెక్కడ నోరు జారుతుందోనని పెదాలు బిగపట్టుకు నిల్చున్నాడు.

'మీకు టిక్కెట్టు కావాలా?' సుశీల అడిగింది.

'అవును' అన్నట్టుగా తల ఆడించాడు.

'ఆ డబ్బులు ఇలా పారేయండి!' అంటూనే డబ్బులు తీసుకువెళ్ళి యిద్దరి టిక్కెట్టు తీసుకువచ్చింది.

తనే చొరవ తీసుకొని యిద్దరి టిక్కెట్లకూ డబ్బులిస్తే చాలా బాగుండేదని చాలాసేపు మథనపడ్డాడు.

లోపలికి వెళుతూనే 'అదుగో పదండి...' అక్కడ రెండు సీట్లు ఖాళీగా వున్నయి!

హరిరామ్









అన్నది.

సుబ్రహ్మణ్యం సుశీలను బుద్ధిమంతుడిలా అనుసరించాడు. కూర్చున్నవాళ్ళ కాళ్ళను తొక్కకుండా జాగ్రత్తపడుతూ వెళ్ళి సుశీల పక్కన కూర్చున్నాడు.

'చెప్పండి!' అన్నది కూర్చున్న తరువాత సుశీల.

'ఏం చెప్పమంటారు?' అన్నాడు తలెత్తకుండానే సుబ్రహ్మణ్యం.

'మాట మాత్రం సినిమాకు వెళుతున్నట్లుగా ముందుగా చెబితే...ఇద్దరం కలిసే వచ్చేవాళ్ళంగా!'

'హిహిహి...'

'ఏమిటి...హిహిహి.'

'రాత్రి నాకో కల వచ్చిందండీ!' అన్నాడు కాస్త ధైర్యం తెచ్చుకొని.

'మనం ఇద్దరం ఇలా వచ్చినట్లా?...'

'కాదండి!...నేను అన్నం తింటుంటే ఓ రాక్షసుడు నా మీద పడ్డాడట...నాకు భయంపుట్టి నేను గోడకు అతుక్కుపోయానట!' అన్నాడు బుద్ధిమంతుడిలా సుశీల మొఖంలోకి చూస్తూ.

'అరె! పాపం...జ్వరంగాని రాలేదుగదా?' ...అన్నది చేయి మీద చేయివేసి చూస్తూ.

'లేదండి!'

'అయితే ఒక పని చేయండి...ఈ సారి ఆ రాక్షసుడు గనుక కనిపిస్తే నా పేరు చెప్పండి...పిల్లిలా అయిపోతాడు... వెంటనే బుజాన వేసుకొని తీసుకెళ్ళి మూసీలో పారేయండి...ఇంకెప్పుడూ ఎవ్వరి కల్లోకి రాడు!'

'థాంక్స్!...మీ యింటి పేరండీ!' అన్నాడు తన్మయంగా.

'అక్కర్లేదు... సుశీలారాణి అని చెబితే చాలు!' అన్నది నవ్వి.

సినిమాకు ముందుగా కాల్గేట్ టూత్ పేస్టు చూపించారు. రెమీ పౌడర్ చూపించారు లక్స్ అందాల తారను చూపించారు చార్మినార్ సిగెరెట్లును చూపించారు. అవి చూపించారు. ఇవి చూపించారు — సినిమా మొదలుపెట్టారు.

—భయంకరమైన శబ్దం. ఓ పక్షి తన విశాలమైన రెక్కలను ఊపుకుంటూ కొండల మీద గింగిరాలు కొట్టుకుంటూ తిరుగుతోంది ... భయం కలిగించేలా మ్యూజిక్...

'నాకు భయమేస్తున్నదండి !' అన్నది సుబ్రహ్మణ్యం వైపుకు వంగుతూ సుశీల.

'నా పేరు మనస్సులో అనుకుంటుండండి!' అన్నాడు సగం కళ్ళు మూసుకొని గడుసుగా.

'మీ యింటి పేరు?' అడిగింది.

## కలల్లో కమలం

'ఒద్దండి...ఒట్టి సుబ్రమణ్యమూర్తి అని అనుకోండి చాలు!' అన్నాడు నవ్వి.

'మీ యింటి పేరు 'ఒట్టి'...?'అన్నది నవ్వుతూ సుశీల.

సుబ్రహ్మణ్యమూ హాయిగా నవ్వాడు.

సుశీల తలంటిపోసుకున్నదేమో రాగిరంగు మెత్తటిజుట్టు చల్లగాలికి ఎగురుతోంది ...ఎర్రటి మనిషి. చెంపకు చేరడేసి కళ్ళు ...కొనదేరినముక్కు...

'దేవుడా! సుశీలను సుబ్రమణ్యానికి భార్యగాచేస్తే నీ కొండకు ఎన్నిసార్లు రమ్మంటే అన్నిసార్లు వస్తాను!' సినిమా అయిపోయేటంతవరకు ఆమెను దొంగ చూపులు చూస్తూ జపంచేస్తూనే వున్నాడు.

అసలు మధ్యలో ఆవేశమొచ్చేసి, ఆమె బుజంమీదగా చేయివేసి, తన గుండెలకు హత్తుకొని, 'సుశీలా!—నీవులేందే నేను బ్రతకలేను...నీవే నాగుండెవు!' అని చెప్పాలనిపించిందిగాని—ఆమధ్య సుశీల తనని ఎడాపెడా కొట్టినకల గుర్తుకువచ్చి ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

సినిమా అయిపోయింతరువాత ఇద్దరూ ఇంటికి నడిచారు. కొంపలో అడుగుపెట్టేటంతవరకూ—తను భోజనంచేయాలనిగాని, ఆ యింట్లో ఒక రాక్షసుడు వున్నాడనిగాని సుబ్రమణ్యానికి గుర్తుకు రాలేదు. ఆ రెండూ గుర్తుకు వచ్చేటప్పటికి ముందుగా నీరసం, ఆపైన భయం అతడిని ఆవరించినయి.

దిగులుగా గది తలుపులు తెరుస్తున్న సుబ్రమణ్యాన్ని, 'మీరు భోజనం చేయలేదు గదా...రండి మా యింటికి భోజనానికి. అన్నం తక్కువయితే ఉజను అరటిపండ్లున్నయి!' అన్నది.

'నాకు ఆకలి కావటంలేదండి.'

'ఇంకా మా నాన్న గూడా భోంచేసి వుండడు...అంతా కలిసి తిందాం!'

'ఎబ్బే వద్దండీ'

'మా నాన్నను పిలుస్తానుండండి!'

'వద్దండీ!'

'నాన్నా!...' పెద్దగా పిలవసాగింది.

'నేను వస్తాను గాని...మీరు వెళ్ళండి!' అన్నాడు గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుంటూ సుబ్రమణ్యం.

* *

భోజనం చేసివచ్చి పడుకుంటే నిద్ర పట్టలేదు.

సుశీలే కళ్ళముందు మెదులుతోంది.

—సుశీల తన అర్ధాంగి అయితే!

జీవితం జోడు గుర్రాల రథంలా పరుగెత్తాలంటే సుశీల తోడులోనే వున్నది!

ఆ సంతోషంలోనే రేపో పెద్ద ప్రోగాం—గండిపేటకు వేశాడు, రెండు రోజులు

కాలవు వస్తే పెద్ద బోర్ అన్నాడు: పొద్దున్నే బయల్దేరి వెళ్ళి—సాయంత్రందాకా తనివిదీరా చల్లగాలి కొట్టేసి వద్దామనుకున్నారు...ఏ.వేవి చేసి తీసుకువెళ్ళాలో గూడా నిర్ణయించుకున్నారు — అసలు అన్నీ తనే హోటల్‌నుంచి తీసుకు వస్తానన్నాడు గాని సుశీలే వీటో చేసింది...

—ఆమె మాటలు, ఆమె చూపులు గుర్తుకు తెచ్చుకుంటూ లైటు వుంచుకునే సుబ్రమణ్యం తెల్లవార్లూ పడుకున్నాడు.

అతని కళ్ళ ముందు సుశీల వున్నది. పట్టుకుచ్చులాంటి ఆమె జుట్టు గాలిలో మేఘాల్లా ఎగురుతూ అతడిని కప్పివేస్తోంది. ఆమె చేరడేసి కళ్ళ మీదనుంచి తన చూపులను మరల్చుకోలేక పోతున్నాడు.

—సుశీల లేందే తను బ్రతకలేడు!

వెంటనే పరుగెత్తుకు వెళ్ళి సుశీలకు, సుశీల తండ్రికి గూడా చెప్పేయ్యాలన్నంత ఆవేశమొచ్చింది.

అవును—

ఏ ఆడపిల్ల తండ్రికి సంతోషం కలిగించవు తన మాటలు ?

కొంత పన్నెండవుతుంటే బలవంతాన కళ్ళు మూసుకున్నాడు !

* * *

మళ్ళా ఆ రాత్రి నేనున్నానంటూ ఓకల వచ్చింది. అందులో...జనం... పెళ్ళి పందిరి ...సన్నాయిమేళాలు...కమలం పెళ్ళికూతురాయెనే...సుబ్రమణ్యం పెళ్ళికొడుకాయెనే..

తను లేచి వంగొని... భూమిలోకి వంగిపోతున్నట్లుగా కూర్చున్న కమలం మెళ్ళో మంగళసూత్రాన్ని మూడు ముళ్ళూ వేసేస్తున్నాడట...

ఫ్లాష్‌లు...అక్షింతలు ... సన్నాయిమేళం ...నవ్వులూ, కేరింతలూ ... ఫుటోలు... ఫ్లాష్‌లు...అక్షింతలు...

ఎవరో డాన్స్ గూడా చేస్తున్నారు!

మరీ అంత సంతోషం ఆపుకోలేకపోయేటప్పటికి మెలుకువ వచ్చేసింది. లేచి కూర్చున్నాడు. గాలిలో తేలిపోతూ మంచం మీదే కూర్చున్నాడు.

అతడికి ఎప్పుడు తెల్లవారిందో గూడా తెలియదు.

ఫ్లాష్‌లు ... ఫుటోలు ... అక్షింతలు... కేరింతలు...గొణుక్కుంటున్నాడు — చేతిని మోకాలి మీద పెట్టుకొని, చెంపను చేతిలో పెట్టుకొని, ఆ కలల్లో తిరుగుతూ...

సుశీల తలుపు బాదటమే గాకుండా గొంతెత్తి పెద్దగా పిలవనుగూడా పిలిచింది.

ఉలిక్కిపడి వెళ్ళి తలుపు తీశాడు.

'ఇవాళ మన ప్రోగ్రాం కాన్సిల్ మాష్టారూ!' అన్నది. చాలా హుషారుగా గూడా వున్నట్లే అనిపించింది.

'ఎందుకూ?' అన్నాడు నీరసపడిపోతూ సుబ్రమణ్యం.

'మా బావ వస్తున్నాడు!'

'ఎందుకు ?'

'మా అత్తయ్య గూడా వస్తున్నది !'

'ఎందుకూ ?'

'మా మామయ్య గూడా వస్తున్నాడు!'

'ఎందుకూ ?'

'మా బావైతే పని పాట లేక ఊరికినే వస్తున్నాడు గాని, మా అత్తయ్య, మామయ్యా మాత్రం...'

'ఎందుకూ?'

'మీది ఒట్టి మట్టి బుర్ర... అన్నీ విప్పి అంగా చెప్పాలి !' అంటూనే సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ పారిపోయింది.

ఆమె మొఖం ఆ క్షణంలో సుబ్రమణ్యం మొఖంలోని రక్తాన్ని గూడా పీల్చేసుకొని ఎర్రగా కంది వున్నది! ●

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

ఉత్తమ హాస్య నటుడు



రాజ్‌బాబు

ఉత్తమ సంగీత దర్శకుడు



కె. వి. మహాదేవన్

ఉత్తమ నటి





ఉత్తమ హాస్య నటుడు – రాజ్‌బాబు, ఉత్తమ సంగీత దర్శకుడు – కె. వి. మహాదేవన్, ఉత్తమ నటి – వాణిశ్రీ, ఉత్తమ సహాయ నటి–చంద్రకళ, ఉత్తమ నటుడు – అక్కినేని నాగేశ్వరరావు, ఉత్తమ సహాయ నటుడు – శోభన్‌బాబు, ఉత్తమ దర్శకుడు – వి. మధుసూదనరావు, ఉత్తమ చిత్రం – దసరాబుల్లోడు.

**అందరికీ మా అభినందనలు !**

సినిమా బాలట్‌లో ఎంతో ఉత్సాహంతో పాల్గొని దానిని జయప్రదం చేసిన ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకులందరికీ మా కృతజ్ఞతలు.

బాలట్ ఫలితాలు ఈ కింద యిస్తున్నాము 10 శాతంకంటె తక్కువ ఓట్లు వచ్చిన వ్యక్తుల, చిత్రాల వివరాలు యివ్వటంలేదు

ఉత్తమ హాస్య నటుడిగా ఎన్నిక అయిన శ్రీ రాజ్‌బాబుకి 85 5 ఓట్లు పడితే మిగతావారందరికీ కలిపి 14 5 శాతం ఓట్లు వచ్చాయి.

ఉత్తమ సంగీత దర్శకుడిగా ఎన్నికైన శ్రీ కె వి మహాదేవన్‌కి

ఉత్తమ దర్శకుడు



వి. మధుసూదనరావు

# '71 సినిమా బాలట్ ఫలితాలు!

ఉత్తమ సహాయ నటి



ఉత్తమ నటుడు



అక్కినేని నాగేశ్వరరావు

ఉత్తమ సహాయ నటుడు



శోభన్ బాబు



84 4 శాతం వోట్లు రాగా మిగతావారందరికీ కలిపి 15 6 శాతం వోట్లు పడ్డాయి.

కుమారి వాణిశ్రీ 83 5 శాతం వోట్లతో ఉత్తమనటి స్థానాన్ని సంపాదిస్తే మిగతావారందరికీ కలిపి 16 5 శాతం వోట్లు పడ్డాయి

ఉత్తమ సహాయ నటిగా కుమారి చంద్రకళ 80.1 వోట్లతో ఎన్నిక కాగా మిగిలినవారందరికీ కలిపి 19 9 శాతం వోట్లు వచ్చాయి

ఉత్తమ నటుడిగా ఎన్నికైన శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకి 77.6 శాతం వోట్లు, రెండవ స్థానంలో వచ్చిన శ్రీ శోభన బాబుకి 12 శాతం వోట్లు లభించాయి.

ఉత్తమ సహాయనటుడి స్థానానికి శ్రీ శోభన్‌బాబు 62 8 శాతం వోట్లతో ఎన్నికైనారు. మిగిలినవారిలో ఏ ఒక్కరికీ 10 శాతం వోట్లు రాలేదు.

ఉత్తమ దర్శకుడిగా శ్రీ వి. మధుసూదనరావు 32 9 శాతం వోట్లతో ఎన్నికైనారు. రెండవ మూడవ స్థానాలలో శ్రీ కె. ఎస్. ప్రకాశరావు, శ్రీ వి బి రాజేంద్రప్రసాద్ వరుసగా 27.9 శాతం, 26 శాతం వోట్లతో వచ్చారు.

దసరా బుల్లోడు 32 శాతం వోట్లతో ఉత్తమ చిత్రంగా ఎన్నికైతే, దాని తర్వాతి స్థానాలకి కళ్యాణమండపం, ప్రేమనగర్ చిత్రాలకి వరుసగా 19.4 శాతం, 18.9 శాతం వోట్లు వచ్చాయి.



# పాత్రల్లోని జీవితం

## జయంతి



చిత్రాల్లో నటించేటప్పుడు రకరకాల పాత్రలు లభిస్తాయి. కొన్నిపాత్రలు నిత్యజీవితంతో ముడిపెట్టుకుని పోతాయి. కొన్నికథల్లోని సంఘటనలు జీవితంలో అప్పుడప్పుడు జరిగేవాటికి ఎంతో దగ్గరగా వుండటమేగాక, జీవితంమీద కూడా తమ ప్రభావాన్ని చూపెడుతూ వుంటాయి కన్నడం, అరవం, తెలుగు, హిందీ చిత్రాలన్నీ కలిపి షుమారు డెబ్భయిదాకా నాయికా పాత్రలు ధరించాను ఎంతలేదన్నా ముప్పయి చిత్రాల్లోనైనా, ఆయా సందర్భాలు, నిత్య జీవితంలో 'నామీద తమ ప్రభావాన్ని ప్రదర్శించి వుంటాయి. కొన్ని ఘట్టాలు, నాకు సమన్వయింప జేసుకుని, ఒకవిధమైన రసానుభూతిని పొందటం, ఒకప్పుడు ఏదో చెప్పలేని మానసిక దిగ్భ్రాంతితో ఏణకటం కూడా జరిగింది ఇంతగా చలింపజేసిన యీ ఘట్టాలు, ప్రతిపాత్రలోను కథానుసృతను బట్టి వస్తాయి. కాని నటిగా ఆ సందర్భంలో వాటిని జీవితంలోని స్వంత విషయాలతో పోల్చుకున్నప్పుడు ఒకవిధమైన అనుభూతి, అనుకంపన పొందటం సహజం.

### తెరవెనుక—తెరమీద

'ముట్టరికాలు' చిత్రం మావారు డైరక్టు చేశారు అందులో నేను ప్రేమించిన వ్యక్తిని వివాహం చేసుకుంటా నని సందర్భంలో కన్నతండ్రి ఇంట్లోనుంచి బయటకు గెంటేసే ఘట్టం వుంది ఇది నటించేటప్పుడు నేను, ఎంతగానో వూగిపోయాను. కారణం ఏముంది ? నా జీవితంలో అదే జరిగింది. మావార్ని నేను చేసుకునేటప్పుడు నా తండ్రి నన్ను బయటకు పొమ్మన్నాడు. ఆ పట్టుదలవల్ల నాటికీ నేటికీ చూపులూ, ముట్టరికాలు అదృశ్యమైపోయాయి.

అట్లాగే 'ఇరుకోడుగళ్' అనే అరవ చిత్రం—అదే ఇప్పుడు 'కలెక్టర్ జానకి' అని తెలుగులో జెమినీవారు తీశారు. అందులో నాపాత్ర అమాయకమైన ఇల్లాలు. కాని భర్తకు అదివరకే వివాహమై భార్య వుందని తెలిసినప్పుడు, నేను పడే ఆవేదన, చింత, మానసికవ్యధ ఇంతా అంతా కాదు. ఇది మరి నా జీవితంలోని నిజ విషయమే. ఇది నటించేటప్పుడు సహజంగానే ఆ బాధ, భావాలు విలువెల్లా పెనవేసుకుని నటన అనే అభిప్రాయం రాకుండా సహజత్వం ప్రస్ఫుటమౌతుంది.

### బాధ

'కన్నా నలమా' అనే అరవ చిత్రంలో కూడా అంతే; పిల్లలులేక గొడ్రాలుగా జీవితం అంతమౌతుందా అని తల్లిపడే మానసికవ్యధ ఇంతా అంతాగాదు. ఏడు సంవత్సరాల వైవాహిక జీవితంలో ఆబాధ నేనెంతగా అనుభవించానో నాకే తెలుసు. ఆడదానికి మాతృత్వం జీవితసిద్ధి: అదే లేకపోతే ఆడదై పుట్టటమే అనవసరం. ఆ బాధను నేను అనుభవించాను గనుకనే ఆ సందర్భంలో చిత్రంలో నా నటన ఎంతో సహజంగా వుండి, ప్రజల పత్రికల ప్రశంసలను పొంది, యీనాడు విజయవంతంగా నడుస్తోంది. (ఇప్పుడు తల్లినైనానుకోండి. అది నా అదృష్టం.) ఇట్లాగే అనేక చిత్రాల్లో రకరకాల పాత్రలు—వివిధ సందర్భాలు—ఆయా ఘట్టాల్లో నటించేటప్పుడు జీవితానికి దగ్గరగాగాని, లేక జరిగిన విషయాల్లోగాని, పోలికగా వచ్చినప్పుడు — హృదయంలో ఒక్కసారి భయం, వణుకు వస్తుంది, ఇదే నటనలోని జీవిత సమన్వయం అనిపిస్తుంది. ●


లక్ష్మీ ఎంటర్ప్రైజెస్
సంపూర్ణ రామాయణము
ఈస్ట్మన్ కలర్
దర్శకుడు: బాపు
సంగీతం కె.వి.మహదేవన్
ఛాయాగ్రహణం కె.ఎస్.ప్రసాద్
నిర్మాత నిడమర్తి పద్మాక్షి
లక్ష్మీ ఫిలింస్
LAKSHMI

# సినిమా

## సీతారామరాజుగా శోభన్

సంచలనానికి మరో పేరు డి. ఎల్. నిర్మించిన 'దేవదాసు, ఏకవీర' చిత్రాల్ని ఎన్నటికీ మరువలేము. ధైర్యం ఆయనకు తోబుట్టువులాటిది. అందుకే డి. ఎల్. అంటే పరిశ్రమలో ప్రత్యేక వ్యక్తిగా పరిగణిస్తారు. గతవారం ఆయన్ని కలిసాను. తర్వాతిచిత్రం ఏమిటి? అని అడిగాను, 'సీతారామరాజు' అన్నారు.

'సీతారామరాజు' చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించదలిచారట. యావదాంధ్రులం కొనియాడే విధంగ యీ చిత్రం తయారవుతుందట. కథానాయకుడు ఎవరో తెలుసా? 'తాసిల్దారుగారి అమ్మాయి, అమ్మమాట' చిత్రాల నాయకుడయిన శోభన్‌బాబే, సుంకర సత్యనారాయణచే 'సీతారామరాజు' కథను డి ఎల్. రూపొందిస్తారట. ఈ విన్యాసాత్మక చిత్రాన్ని ఒకకొత్త వ్యక్తి డైరెక్ట్ చేస్తారట. ఆయన పేరు డి. ఎల్. నారాయణ.

## పండంటి కాపురంలో నలుగురు నాయికలు

'సచ్చని సంసారం' కథకు ఉత్తమ బహుమతి నందుకున్న డాక్టర్ ప్రభాకర రెడ్డి వ్రాసిన రెండవ సాంఘిక కథయే 'పండంటి కాపురం'. ఈ చిత్రాన్ని జి. హనుమంతరావు జయప్రద పిక్చర్స్ పేరిట నిర్మిస్తున్నారు. హనుమంతరావంటే ఎవరనుకుంటున్నారు? హీరో కృష్ణ తమ్ముడే! ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మింపబడే యీ చిత్రానికి పి. లక్ష్మీదీపక్ దర్శకుడు.

## మార్చి 17న ప్రారంభం!

'పండంటి కాపురం' చిత్రానికి సద్దిపట్లు సూరి మాటలను కూర్చారు. సంగీతాన్ని కోదండపాణి, కళను అనంతరాం, ఛాయను వి ఎస్ ఆర్ స్వామి, కూర్పును గోపాలరావు నిర్వహిస్తున్నారు. హీరోగా కృష్ణ. అతగాడి అగ్రజులుగా ఎస్వీ రంగారావు, గుమ్మడి, ప్రభాకరరెడ్డి నటిస్తున్నారు. ఈ చిత్రంలో నలుగురు నాయికలు కనిపించడం ఒక విశేషం...వాళ్ళు ఎవరో తెలుసా? జమున, విజయనిర్మల, సరోజాదేవి, మరియు దేవిక సహాయ పాత్రలను రాజబాబు, అల్లు రామలింగయ్య, మిక్కిలినేని, సంధ్యారాణి పోషిస్తారు. ఇప్పటికి మూడు పాటల రికార్డింగు జరిగింది. షూటింగు మార్చి 17న ప్రారంభమవుతుంది. పూర్ణా విడుదల.

## మార్చి 10న దేవుడమ్మ షూటింగు!

శ్రీరమణ చిత్ర ఇంటర్నేషనల్ నిర్మిస్తున్న 'దేవుడమ్మ' చిత్రం షూటింగు మార్చి 10న ప్రసాద్ స్టుడియోలో ప్రారంభమవుతుంది, ఈ చిత్రానికి కె. వి. నందనరావును చలం దర్శకుడిగా పెట్టారు" కథనుబట్టి నటీనటులను ఎన్నిక చెయ్యడం చలంకి బాగా తెలుసు. 'బుల్లెమ్మ—బుల్లోడు' చిత్రంలో కనిపించిన చలం వేరు; 'దేవుడమ్మ'లో కనిపించే చలం వేరు. ఇప్పటికే పరిశ్రమలో, ప్రజల్లో చలం 'యినే'కి విపరీతమైన మోజువుంది. 'దేవుడమ్మ' విడుదలయితే, చలం యశస్సు...!

'దేవుడమ్మ'కి రాజశ్రీ రచయిత. సత్యం సంగీతానికి, మధు ఛాయాగ్రహణానికి నిర్దేశకులు. శ్రీ ఫిలింస్ పంపిణీదారులు.

## ఇద్దరు నాయికలు!

'సుమంగళి, పవిత్ర బంధం' చిత్రాలను అందించిన అశోక్ మూవీస్ తమ మూడవ చిత్రాన్ని మార్చి 8న వారి స్వంత స్టుడియోలో ప్రారంభిస్తున్నారు. ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మింపబడుతున్న యీ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు. ఈ చిత్రంలో యిద్దరు నాయికలున్నారు. వాటిని వాణిశ్రీ, కాంచన పోషిస్తున్నారు. నాయకుడు ఎవర్ గ్రీన్ హీరో చిరుదాం కితుడయిన నాగేశ్వరరావే. ఆచార్య ఆత్రేయ రచన్ను, కె. వి. మహదేవన్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు, మొదటి షెడ్యూలు 8 నుండి 14 వరకు జరుగుతుంది.

## గౌరీ శంకర్ ప్రొడక్షన్స్

కృషితో అదృష్టం కలిస్తే ఏమవుతుంది? మంచి జరుగుతుంది. డబ్బు, పేరు వచ్చిపడుతుంది. దర్శకుడు చంద్రశేఖరరెడ్డిని అదృష్టవంతుడు అని పక్షం రోజులక్రితం వ్రాసాను. రెండు దినాలకి ముందు ఆయనకి మరొక చిత్రాన్ని డైరెక్ట్ చేసే అవకాశం వచ్చింది. ఆ సంస్థ పేరు



'ఊరికి ఉపకారి' నాయకుడు చలంను అభినందిస్తున్న
ఎన్. టి. రామారావు, ఎం. ఎస్. రెడ్డి

గౌరీ శంకర్ ప్రొడక్షన్స్. నిర్మాత పేరు వీరయ్య చౌదరి,

పై చిత్రానికి పినిశెట్టి రచయిత. కృష్ణ నాయకుడు; కృష్ణంరాజు ప్రతి నాయకుడు. కాంచన నాయిక. ఈ చిత్రానికి మస్తాన్ ఇరానీ ఛాయను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని నిర్వహిస్తారు. నల్లం రెడ్డి ప్రసాద్ సమర్పించే యీ చిత్రం జూలైలో ప్రారంభమవుతుంది. ప్రసాద్‌కి పరిశ్రమలో పదేండ్ల అనుభవం వుంది: ఇన్నాళ్లకి చిత్రం నిర్మించే అవకాశం లభించింది.

## ఏప్రిల్ 12న బంగారుబాబు

1970 వరకు వి. బి. రాజేంద్రప్రసాద్‌ని వుత్తమ నిర్మాత అనే వాళ్లందరూ, 'దసరా బుల్లోడు' విడుదలయిన తర్వాత వుత్తమ దర్శక నిర్మాత అని పిలవడం ప్రారంభించారు. ఒక్క చిత్రంలోనే అనుభవజ్ఞుడయిన దర్శకుడు అన్న పేరును ఆర్జించడం అంటే మాటలా? ఆయనకి ప్రజలనాడి బాగాతెలుసు. అందుకే వాళ్ళకి ఎలాంటి కథలు కావాలో, అలాంటి వాటినే నిర్మిస్తున్నారు, ప్రేక్షకుల సైకాలజీ తెలిసిన ఆయనకి మంచి చిత్రాలను నిర్మించడం చాలా తేలిక. వి. బి. రాజేంద్రప్రసాద్ డైరెక్టు చేసే రెండవ చిత్రంయొక్క షూటింగు ఏప్రిల్ 12న ప్రారంభమవుతుంది.

## రెండవ అవకాశం!

ఆ చిత్రం పేరు 'బంగారు బాబు'. కథ, స్క్రీన్‌ప్లేని ఆయనే వ్రాసారు. మాట పాటలను ఆచార్య ఆత్రేయ, సంగీతాన్ని మహదేవన్ సమకూరుస్తారు. ఇక ఫొటోగ్రఫీ మాట అంటారా? ఎస్. వెంకటరత్నం. బంగారు బాబు' ఎవరో తెలుసా? అక్కినేని నాగేశ్వరరావే. నాయిక వాణిశ్రీ ముఖ్య భూమికలను నాగభూషణం, రాజబాబు, రమాప్రభ, ఎస్వీ రంగారావు(గెస్టు) ధరిస్తున్నారు. ఈ చిత్రంలో హెలికాప్టర్ ఫైటింగు ప్రత్యేక ఆకర్షణగా వుంటుంది. కలర్‌లో నిర్మింపబడే 'బంగారు బాబు'ను అన్నపూర్ణా విడుదల చేస్తారు.

## అన్నదమ్ములు ప్రారంభించిన నిండుకుటుంబం

'సంగీత లక్ష్మి' చిత్రం మీకు గుర్తుందనుకుంటా. ఆ చిత్రం ఆర్థిక విజయాన్ని సాధించలేకపోయినా, ప్రజాభిమానాన్ని చూరగొన్నది. గిడుతూరి సూర్యంకి ఆ చిత్రం మంచి పేరును తెచ్చిపెట్టింది.

# సినిమా డైరీ

● సీతారామాంజనేయ పిక్చర్స్ 'సిందు కుటుంబం' షూటింగు ఫిబ్రవరి 25 నుండి 27 వరకు వీనస్‌లో జరిగింది. పి. సాంబశివరావు దర్శకుడు.

రవిశంకర్ పిక్చర్స్ 'మేనకోడలు' షూటింగు మార్చి 1న విక్రంలో జరిగింది. బి. ఎస్. నారాయణ దర్శకుడు.

● రవీంద్రా ఆర్ట్స్ పిక్చర్స్ 'దత్తపుత్రుడు' షూటింగు మార్చి 2 నుండి 8 వరకు, హైద్రాబాదు సారథిలో జరిగింది. టి. ఎల్. బాబు దర్శకుడు.

● శ్రీ రమణచిత్ర ఇంటర్నేషనల్ 'దేవుడమ్మ' మార్చి 10న ప్రసాద్‌లో ప్రారంభమవుతుంది. కే. వి. నందనరావు దర్శకుడు.

● అశోక్ మూవీస్ ప్రొడక్షన్ నెం. 3 షూటింగు విజయా స్టుడియోలో మార్చి 8న ప్రారంభం. వి. మధుసూదనరావు దర్శకుడు.

● జెమినీ ఆర్ట్స్ పిక్చర్స్ 'కలెక్టర్ జానకి' మార్చి 10న నవయుగ ద్వారా విడుదలవుతుంది. ఎస్. ఎస్. బాలన్ దర్శకుడు.

● అన్నపూర్ణా ఆర్ట్స్ పిక్చర్స్ అవుట్‌డోర్ షూటింగు జరిపి (కేరళలో) మార్చి 1న మద్రాసుకు తిరిగివచ్చారు. దుక్కిపాటి మధుసూదనరావు నిర్మించే యీ చిత్రానికి ఆదుర్తి దర్శకుడు.

## సినిమా

ఆ చిత్ర నిర్మాత పేరు అమరా రామసుబ్బారావు.

ఆయన సీతారామాంజనేయ పిక్చర్స్‌ని స్థాపించారు. 'సిందు కుటుంబం' అనెడి సాంఘిక చిత్రాన్ని ఫిబ్రవరి 25న వీనస్‌లో ప్రారంభించారు. ప్రముఖ హీరో ఎన్టీ రామారావు స్విచ్ ఆన్‌చేసారు. వారి తమ్ముడు త్రివిక్రమరావు క్లాప్ కొట్టారు. ఈ చిత్రానికి 'అర్ధరాత్రి' ఫేమ్ పి. సాంబశివరావు దర్శకుడు,

ముఖ్యపాత్రలను జగ్గయ్య, కృష్ణ, నాగభూషణం, రాజబాబు, జమున, అంజలీదేవి, విజయలలిత, నిర్మల పోషిస్తున్నారు. ఈ చిత్రానికి అప్పారావు ఛాయను, రాజేశ్వరరావు సంగీతాన్ని, అంకిరెడ్డి కూర్పును, రాజేంద్రకుమార్ కళను నిర్వహిస్తున్నారు. మొదటి షెడ్యూలు 25 నుండి 27 వరకు (3 రోజులు) జరిగింది.

## 8 మందికి మాత్రమే కాల్ షీట్‌లు!

'తాసిల్దారుగారి అమ్మాయి', 'చెల్లెలి కాపురం', 'అమ్మమాట' చిత్రాల్లో వెరైటీ పాత్రలను ప్రతిభావంతంగా పోషించి, ప్రేక్షకుల అత్యంత అభిమానానికి పాత్రుడయ్యాడు శోభన్‌బాబు. గతవారం ఆయన్ని సుభాషిణీ థియేటర్లో కలిసాను. మీరు అంగీకరించిన సంస్థలేమిటి? అని ప్రశ్నించాను.

'మమతా ప్రొడక్షన్స్, అన్నపూర్ణా కంబైన్స్, సురేష్, తాతినేని ప్రకాశరావు డైరెక్షన్‌లో ఒక చిత్రం, రవీంద్రా ఆర్ట్స్), సత్య చిత్ర, విజయలక్ష్మి, సుభాషిణీ, శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్, ఉషశ్రీ, మధుమూవీస్, శ్రీధర్ ప్రొడక్షన్స్, శ్రీ బాలాజీ చిత్ర నిర్మించనున్న చిత్రాల్లో పని చెయ్యడానికి అంగీకరించాను' అన్నారు శోభన్. 'సంవత్సరానికి ఏనిమిది చిత్రాల్లో మాత్రమే నన్నారు, పట్టీలో పదముగ్గురున్నారే' అని ప్రశ్నించాను. 'ఈ ఏడాదికి 8 మందికి మాత్రమే కాల్‌షీట్లు యివ్వగలుగుతానేమో, పైగా అందరికీ కథ రెడీ కావాలి గదా' అని బదులిచ్చారు హీరో శోభన్,

## కొత్త సంస్థలో కొత్త తారలు

భారతీనగర్‌లో ఒక కొత్త సంస్థ వెలసింది. ఆ సంస్థ పేరు శ్రీ పూర్ణా మూవీస్. సంస్థ కొత్తదే గాని, నిర్మాతలు పరిశ్రమకి, ప్రజకి చిరపరిచితులే. వాళ్ళ పేర్లు ఏ. పూర్ణచంద్రరావు, చంద్రశేఖర్. లోగడ 'మాతృదేవత, కూతురు కోడలు' సినిమాలు తీసియున్నారు.

కొత్త పేరిట వెలసిన యీ సంస్థలో



'రాజ్ మహల్'లో విజయలలిత

కొంతమంది కొత్త తారలను పరిచయం చేస్తున్నారు. కథానాయిక వేషానికి ఒక కొత్త అమ్మాయిని సెలెక్ట్ చేసారు. ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని కె. సత్యగాత్మ నిర్వహిస్తారు. సంగీతాన్ని మహాదేవన్, పాటను శేఖర్—సింగ్, కళను బి. ఎన్. కృష్ణ చేపట్టారు. డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు వ్రాసిన 'హారతి' కథను శ్రీ స్వర్ణా మూవీస్ నిర్మిస్తూ, వారి చేతనే మాటలను రాయిస్తున్నారు. షూటింగు ఏప్రిల్ నుండి వుంటుందట.

## ఏప్రిల్ లో భక్త తుకారాం ప్రారంభం!

'విప్రనారాయణ' పాత్రలో అక్కినేని జీవించారు, అన్నారు అప్పట్లో. ఆ తర్వాత అలాంటి భాగవతోత్తముని పాత్ర 'బుద్ధిమంతుడు'లో దొరికింది. విప్రనారాయణను మించిపోయాడు; అన్నారు అనేకులు. అప్పట్నుంచి మొన్నటి 'ప్రేమనగర్' వరకు నాగేశ్వరరావు విభిన్న పాత్రలను పోషించి, ప్రజలను మెప్పిస్తూనే వున్నారు. ఆయన ఎక్కువగా అభిమానించే పాత్రలు కొన్ని వున్నాయి. వాటిలో తుకారాం ఒకటి.

అంజలీ పిక్చర్స్‌కి ప్రజల్లో మంచి పేరు వుండేది. అక్కినేని — అంజలీదేవి జంటకి విపరీతమైన డిమాండు వుండేది. ఆదినారాయణరావు సంగీతానికి రాళ్లు కదిలేవట. చాలాకాలం తర్వాత అ+అ+ఆ ల కాంబినేషన్ కుదిరింది. 'భక్త తుకారాం' జీవిత గాథను అంజలీ పిక్చర్స్ కంబైన్స్‌వారు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్నారు. ఈ చిత్రం తెలుగు చిత్ర రంగంలో సంచలనాన్ని కలిగించి తీరుతుంది. ఈ చిత్రాన్ని ఒక ప్రెస్టీజ్ చిత్రంగా రూపొందించడానికి నిర్మాతలు, నటీనటులు, సాంకేతిక నిపుణులు కంకణం కట్టుకున్నారు. ఈ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకత్వాన్ని, ఆదినారాయణరావు సంగీతాన్ని నిర్వహిస్తారు.

నట సామ్రాట్ నాగేశ్వరరావు, నడిగర్ తిలగం శివాజీ గణేశన్ 'భక్త తుకారాం'లో ఢీ కొంటున్నారు. ఎవరు నెగ్గుతారో మరి? మిగతా నటీ నటులు తక్కువవాళ్లు అనుకునేరు సుమా. అంజలీదేవి, గుమ్మడి, నాగభూషణం, విజయలలిత, శ్రీరంజని ప్రధాన పాత్రలను పోషిస్తారు. ఈ చిత్రం షూటింగు హైదరాబాదు సారథిలో ఏప్రిల్‌లో ప్రారంభమవుతుంది. లక్ష్మీఫిలింస్



'బీదలపాట్లు'లో విజయలలిత, చంద్రమోహన్

ద్వారా విడుదలవుతుంది.

## సినిమా

## బీదలపాట్లు

ఎలెక్షన్లు పూర్తి అయినాయి. కొత్త మంత్రివర్గాలు ఏర్పడబోతున్నాయి. నెలకి సగటున నాలుగు చిత్రాలు విడుదలవుతున్నాయి. కాని అన్నీ నెగ్గవుగదా. మార్చి 24 న ఒక చిత్రం వస్తూంది. ఆ చిత్రానికి ప్రజలు ఎక్కువ ఓట్లువేసే అవకాశం వున్నట్టు కనిపిస్తూంది. ఆ చిత్రం పేరు 'బీదలపాట్లు'.

'బీదలపాట్లు' చిత్రంలో విజయలలిత, నాగేశ్వరరావుల కృషి, సఖ్యత ఆద్యంతం కనిపిస్తుంది. ఇద్దరి పేరును యీ చిత్రం నిలబెట్టి తీరుతుంది. ఇటీవల విడుదలయిన చిత్రాల్లో యింత సిట్‌గా వున్నదాన్ని నేను చూడలేదు. ఒక చిత్రం విజయవంతం కావాలంటే, సమిష్టి కృషి చాలా అవసరం అని 'బీదలపాట్లు' నిరూపిస్తుంది. మినిమమ్ గ్యారంటీవున్న చిత్రాల్లో దీన్ని నిరభ్యంతరంగా చేర్చవచ్చు. అన్నపూర్ణా సంపిణీ సంస్థకి యిదొక లాభకారిగా వుండగలదు.

—శ్రీనివాస్

## మీకు తెలుసా?

జగపతి రాజేంద్రప్రసాద్ నిర్మించే 'బంగారు బాబు' చిత్రంలో హెలికాప్టర్ ఫైటింగు వుంటుంది.

ప్రస్తుతం నాగేశ్వరరావు నటిస్తున్న చిత్రాలన్నీ కలర్ చిత్రాలే. అన్నింటిలో వాణిశ్రీయే నాయికగా నటిస్తూంది.

డి. బి. ఎన్ వారి 'అబ్బాయిగారు—అమ్మాయిగారు' చిత్రంలో సంగీత దర్శకుడు కోదండపాణి తమ్ముడు వెంకన్నబాబు ఒక హాస్య పాత్రను పోషించాడు.

బేబీ రోజారమణి ఒక మలయాళ చిత్రంలో నాయికగా నటిస్తుందట.

జయప్రద పిక్చర్స్‌కి హీరో కృష్ణ తమ్ముడు జి. హనుమంతరావు అధినేత.

కలకత్తాలో చలం, హీరో ఉత్తమకుమార్ తనతో తీసికెళ్ళి సినీ ప్రముఖులందరికి పరిచయం చేసారట.

నేపథ్య గాయకుడు ఎస్. పి. బి. తన కుమారుడికి 'కళ్యాణ్ చరణ్' అని పేరు పెట్టారట.




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press ( & 7, Thambu Chetty Street, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3. Chief Editor : S. Sambhu Prasad.

కారులో ఆయిల్ ఐపోయింది!
మీ అమ్మ నడిగి ఉగాది పచ్చడి
— ఓ చెంబుడు పట్రా బాబూ!!



ఏమండోయ్! ఈ ఉగాదికి మా
మహిళా సంఘం సభ్యుల్నందర్నీ
మనింటికి ఆహ్వానించాను!! ఓ
మణుగు చింతపండూ రెండు
మణుగులు బెల్లమూ నాలుగు
బస్తాలు వేప్పువ్వూ వెయ్యి మామిడి
పిందెలూ పట్రండి!!



దీన్ని రోజూ ఓ చెంబాడు —
సేవిస్తూ ఉంటాను!! దీంట్లో —
టానిక్కులో మాదిరిగా ఇనుమూ
గ్లూకోజూ విటమినులూ ఉన్నాయి!!



ప్రతి ఉగాదికీ ఇలా పచ్చడి మీద
కార్టూనులు వేసే మమ్మల్ని బోరు —
కొట్టుక పోతే — మరో సబ్జెక్టే —
దొరకదా మీకూ? ఆఁయ్!!



Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.




అశోకా శాండల్ వుడ్ (Regd)

ఫేస్-టాల్కం & ఆల్ పర్పస్ పౌడర్లు

మీకు సదా నవయవ్వన శోభ-మరియు
నిత్య నూతన సౌందర్యము కావలెననిన
మీరు సదా అశోకా శాండల్‌వుడ్ పౌడర్లనే ఉపయోగించండి

విజయా కెమికల్సు, మద్రాసు-7.